4.2.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 5, విడిప్రతి: రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి.



## అత్త అల్లుళ్ళ పోరే రాజీనామా కారణం!

తెలుగు దేశంలో అసమ్మతి అగ్ని పర్వతం బ్రద్దలైంది; కుటుంబ కలహపు కార్చిచ్చు అంటుకున్నది. అల్లుళ్ళిద్దరూ మామపై తిరుగుబాటుకు సంకల్పించి, సన్నద్ధులైనారు. అత్త, అల్లుళ్ళ సంవాదపు నాటకం మంచి రస కందాయంలో పడింది.

బుధవారం సాయంత్రం పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావు తెలుగు యువత అధ్యక్ష పదవికి, పార్లమెంటరీ సభ్యత్వానికి, పార్టీ ప్రాథమిక సభ్యత్వానికి కలిపి రాజీనామా చేయడం వెనుక, గత మూడు నెలలుగా నలుగు తున్న కుటుంబ కలహపు నేపథ్యం వుంది. అత్తగారి స్థానంలో కొత్తగా వచ్చి చేరిన శ్రీమతి లక్ష్మి పార్వతి రాజకీయ



నిస్సహాయంగా వెను దిరగడమే ఈ రాజీనామాకు అర్థం. శ్రీమతి లక్ష్మి పార్వతి గత మూడు నెలల నుంచి ఎన్టీఆర్ తర్వాత పార్టీలో తనదే పెత్తనం స్వీకరించడాన్ని ప్రతిఘటించి, పోరాడి, ఓటమి నంగీకరిస్తూ అగ్రస్థానం అన్న తీరులో ప్రవర్తిస్తున్నారు. ప్రపంచానికంతా చండ శాసనుడైన ఎన్టీఆర్, ఆమె సమక్షంలో మాత్రం మార్దాల సదృశుడు. ఆయనలోని ఏ బలహీనతను కనిపెట్టి, నొక్కిపట్టి వున్నదో కాని, మేరు పర్వతం వంటి రామారావు పిపీలకం వలె, లక్ష్మి పార్వతి కి ఇస్తే ఆడె బొమ్మ వలె మారిపోయారు.

ఆమె రాజమండ్రి సదస్సుకు వచ్చినప్పుడే ఇద్దరల్లుళ్ళ అభ్యంతరాలు చెప్పారు. కాని అవి పని చేయలేదు. పెళ్లి సమయంలో - ఆమె తన వ్యక్తిగత విషయాలలో తప్ప తెలుగుదేశం పార్టీలో కాని, కుటుంబంలో కాని జోక్యం చేసుకోదని ఎన్టీఆర్ చెప్పిన మాటలు దండలు మార్చుకున్న మరుక్షణంలోనే మరుగున పడి పోయాయి. పార్టీకి సంబంధించిన ప్రతి నిర్ణయం తన అనుమతితో జరగాలని, ప్రతి నాయకుడూ తననే

కొరవ 7 పేజీలో






## తిట్ల మంత్రులకు ముఖ్యమంత్రి చురక!

మంత్రులు తమను ఎక్కడ పడితే అక్కడ తిట్టున్నారంటూ కొందరు అధికారులు ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశారు. దీనిపై ముఖ్యమంత్రి ఆగ్రహించి పరోక్షంగా ఆ మంత్రుల్ని హెచ్చరించారట.

ఇటీవలి మంత్రి వర్గ సమావేశం తర్వాత ముఖ్యమంత్రి తన మంత్రి వర్గ సహచరులకు విందు ఇచ్చారు. ఈ సందర్భంగా ముఖ్యమంత్రి శ్రీ విజయ భాస్కర రెడ్డి 'తిట్ల' మంత్రుల ప్రస్తావన తెచ్చారట. కొందరు మంత్రులు తమ హోదాకు తగ్గట్టుగా వ్యవహరించడం లేదని, సమయం సందర్భం లేకుండా అధికారుల్ని తిట్టి పోస్తున్నట్లు తన దృష్టికి వచ్చిందని, అటువంటి మంత్రులు ఇప్పటికైనా తమ వైఖరి మార్చుకోక పోతే తగు చర్య తీసుకోగలనని ముఖ్యమంత్రి పరోక్షంగా మందలించారట. ఈ మందలింపు జరిగిన తక్షణమే మంత్రులందరూ మన జిల్లా మంత్రి కలికి యానాది రెడ్డి, సమాచార మంత్రి డి. శ్రీనివాస్ వంకే తిరిగి చూశారట. దానితో ఈ మంత్రులిద్దరూ నాలుక్కరచుకోవాల్సి వచ్చింది.

## ఏలూరు సదస్సు ఏమౌతుందో!

కాంగ్రెస్ పార్టీ ఈనెల 6 తేదిన ఏలూరులో ఏర్పాటు చేస్తున్న 'ప్రాంతీయ సదస్సు' ముఖ్యమంత్రికి ప్రతిష్టాకరంగా తయారైంది. ఈ సదస్సును ఎలాగైనా విజయ వంతం చేయాలని ముఖ్యమంత్రి గట్టి పట్టుదలతో వున్నారు. ఇటీవల రాజమండ్రిలో తెలుగుదేశం జరిపిన ప్రాంతీయ సదస్సుకు అనూహ్యంగా జనం హాజరు కావటంతో ఏలూరు సదస్సును అంతకంటె బ్రహ్మాండంగా నిర్వహించాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. సదస్సు ఏర్పాట్లు చూసేందుకు మంత్రి వర్గంలోని సగం మంది మంత్రులు ఏలూరులో మకాం చేసి అన్ని వనరుల్ని సమీక రిస్తున్నారు. మాజీమంత్రి దివాకర్ రెడ్డి, రవాణా మంత్రి మైసూరా రెడ్డి, గనుల మంత్రి హరిరామ జోగయ్య, స్త్రీ_ శిశు సంక్షేమ మంత్రి శ్రీమతి వరలక్ష్మి సదస్సు ఇన్‌చార్జ్‌లుగా వున్నారు. ఏలూరు చుట్టు పక్కల నుంచే గాక పరిసర జిల్లాల నుంచి లక్షలాది మందిని సదస్సుకు తరలించేందుకు "వాహనాల" ను పెద్ద సంఖ్యలో సమకూర్చుతున్నారు. మొత్తం 10 లక్షల మంది సదస్సుకు హాజరవుతారని మంత్రి హరిరామ జోగయ్య ప్రకటించారు. అయితే సదస్సు జరిగే స్థల విస్తీర్ణం కేవలం ఏడెకరాలు మాత్రమే కావటంతో 10 లక్షల మంది ఎలా పడ్తారన్నది ప్రశ్నార్థకంగా తయారైంది. ఏమైతేనేమి రాష్ట్ర ప్రభుత్వ సహాయ సహకారాలతో అధికార పార్టీ నిర్వహిస్తున్న సదస్సు కాబట్టి హంగూ ఆర్భాటాలకు కొదవేమీ లేదు. ఇలా ఉండగా ఇటీవలి రాజ్యసభ ఎన్నికల్లో తమ కులాలకు సీట్లు ఇవ్వలేదని కోస్తా ప్రాంతరిలోని కమ్మ, కాపు కులస్తులు ఆగ్రహంగా వున్నారు. వీరి ఆగ్రహ ప్రభావం ఏలూరు సదస్సు మీద ఉంటుందా లేదా? అన్నది వేచి చూడాల్సిందే!

### 'కలికి' వీర శైవం

శివభక్తుడైన కలికి యానాది రెడ్డి గారు మరీ వీర శైవుడిగా వ్యవహరిస్తున్నట్లు వార్త లందుతున్నాయి. రాష్ట్ర దేవాదాయ మంత్రి అయిన శ్రీ యానాది రెడ్డి ఎక్కువగా శివాలయాల సందర్శన చేయటం సహజమే అయినా వైష్ణవులకు మాత్రం కన్నెర్రగా వుంటోందట. కొందరు వీర వైష్ణవులు ఈ విషయమై ఫిర్యాదు కూడా చేసినట్లు భోగట్టా.

ఇలా వుండగా ఇటీవల యానాదిరెడ్డి శ్రీకాళహస్తి దేవాలయాన్ని సందర్శించినపుడు పూజారి తప్పుడు మంత్రాలు చదువుతున్నాడని మంత్రిగారు తప్పు పట్టి ఆ పూజారి తుప్పు వదిలించారట. దానితో మంత్రిగారు వస్తున్నారంటె అర్చకులు మంత్రాలను తిరిగి వల్లె వేసుకొని 'రిహార్సల్' చేసుకుంటున్నారట.

యానాదిరెడ్డి ఇటీవల శ్రీశైలం దేవాలయ సందర్శన చేసి వచ్చారు. వచ్చిన దగ్గర నుంచి ఆయన శ్రీశైలం దేవస్థానం వాస్తు బాగోలేదని, దేవాలయ వాస్తును అర్జంటుగా మార్చాలని నానా హడావుడి చేస్తున్నట్లు రాజధాని భోగట్టా.

చంద్రశేఖర్ ప్రభుత్వం బంగారు మాత్రమే తాకట్టు పెట్టింది; మన్మోహన్‌సింగ్ ఏకంగా దేశాన్నే అమ్మేస్తున్నాడు!

# సంస్కరణలంటే పరిశ్రమల అంతమా?

మన్‌మోహన్ సింగ్ నిజ స్వరూపం ఇప్పుడు వెల్లడౌతున్నది; అది అత్యంత వికృతంగా వుంది; కల్లబొల్లి కబుర్లతో, అరచేతిలో వైకుంఠ దర్శన భ్రాంతితో ఆయన దేశాన్ని ఎంత దారుణంగా వంచిస్తున్నాడో అవగత మౌతున్నది; ఆర్థిక సంస్కరణలు అమలు చేసిన సాహసిగా, విదేశీ మారక ద్రవ్య నిల్వలు పెంచిన మేధావిగా ప్రపంచం మన్ననలు అందుకోవాలనే స్వార్థ సంకల్పంతో మన్ మోహన్ సింగ్ భారత దేశాన్ని విదేశీయుల చేతిలో పెడుతున్నారు; మూడ వందలేళ్ల నాడు ఈస్టిండియా కంపెనీకి ఆనాటి రాజులు, శ్రీమంతులు దేశాన్ని అమ్మేసినట్లు; నేడాయన అమెరికా, జపాన్ పారిశ్రామిక వేత్తలకు, ఐఎంఎఫ్, వరల్డ్ బ్యాంక్‌లకు తాకట్టు పెడుతున్నారు. సరళీకృత ఆర్థిక విధానాల ముసుగులో, బహుళ జాతి కంపెనీల చేతిలో కీలు బొమ్మ వలె మారిన మన్మోహన్ సింగ్ జాతీయ పారిశ్రామిక రంగాన్ని చేజేతులా చంపి, పాతర వేస్తున్నాడు. మధ్య తరగతి ప్రజానీకాన్ని బంగారు పంజరంలో బంధిస్తున్నాడు.

ఆర్థికంగా దివాలా స్థితిలో వుండిన దేశాన్ని అప్పుల వూబి నుంచి రక్షించిన దేముడిగా జనమంతా మన్ మోహన్ సింగ్‌ను కీర్తించేటప్పుడు, ఆయన విధానాల వల్ల దేశం అధోగతి పాలౌతున్నదని నిందించడం విచిత్రంగా కన్పించ వచ్చు; విడ్డూరంగా తోచవచ్చు. కాని అది నింద కాదు; నిజం! విస్మృతమైన నిజం; ప్రతి పక్షాలు కలదెలుసుకుని ప్రతిఘటించ కుంటే, స్వపక్షీయులు కల మేలుకొని పత్రిక తెరుకొంటే భారతీయ పరిశ్రమలు పురావస్తు ప్రదర్శన శాలల్లో తలదాచు కోవలసి వస్తుంది.

ఆర్థిక విధానాలు సరళీకృత మైనందువల్ల, నియంత్రణలు తొలగించి నందువల్ల, చట్టాలు మార్చినందువల్ల వస్తువుల ఉత్పత్తి పెరగాలి; వస్తువుల అమ్మకం పెరగాలి; ప్రజల కొనుగోలు శక్తి పెరగాలి; జీవన ప్రమాణాలు పెరగాలి. గత మూడు సంవత్సరాలలో వాటిలో ఏ ఒక్కటైనా జరిగిందా? జరిగే అవకాశం కన్పడుతున్నదా? లేదు కాక లేదు! పై పెచ్చు, విదేశీ పారిశ్రామిక వేత్తలకు రెడ్ కార్పెట్ స్వాగతం చెప్పి, స్వదేశీ పరిశ్రమలను సవతి తల్లి ప్రేమతో చూడడం వల్ల పైన చెప్పిన వాటికి విరుద్ధమైన ఫలితాలు వస్తున్నాయి. భారతీయ పరిశ్రమలు మూతపడి పోతున్నాయి; భారతీయ వస్త్రోత్పత్తి క్షీణించి పోతున్నది.

యంత్ర పరికరాల తయారీ పరిశ్రమలే చూడండి. మన్ మోహన్ సింగ్ విదేశాల నుంచి దిగుమతి చేసుకునే యంత్రాల పైన కస్టమ్స్ సుంకం తీసివేశారు; ఎక్సైజ్ రద్దు చేశారు; అమ్మకం పన్ను తొలగించారు. ఫలితంగా వేలాది కోట్ల రూపాయల విలువైన యంత్రాలు కుప్ప తెప్పలుగా వచ్చి పడుతున్నాయి. దేశంలో తయారయ్యే మెషిన్లు కొనే వాడు లేడు. అందరూ చెప్పే సాకు - భారతీయ యంత్రాలు విదేశీ వాటితో నాణ్యతతో సరితూగలేవని. అది నిజమే. కాని నాణ్యత లేదని విదేశీ యంత్రాలను స్వేచ్ఛగా దిగుమతి చేసుకునే వీలు కల్పించిన మన్ మోహన్ సింగ్, స్వదేశీ యంత్రాలు తన నాణ్యత పెంచు కొనడానికి ఏ మాత్రం సహకరించడం లేదు. కొన్ని విడి భాగాలు దిగుమతి చేసుకొని, యంత్రాలు తయారు చేస్తే అవి



విదేశాల నాణ్యతకు సమానంగా వుంటాయి. కాని విడి భాగాల దిగుమతి పైన 45 నుంచి 85 శాతం కస్టమ్ సుంకం కట్టాలి; 10 శాతం సెంట్రల్ సేల్స్ ట్యాక్స్, 16 శాతం రాష్ట్ర అమ్మకం పన్ను చెల్లించాలి; 5నుంచి 17 శాతం ఎక్సైజ్ భరించాలి. ఇవన్నీ కలిస్తే విదేశీ యంత్రాలతో సరి సమానమైన యంత్రాలు, వాటికంటే కనీసం 60 శాతం అధికమౌతాయి. ఇంక ఎవ్వరు కొంటారు మన దేశ పరికరాలను?

ఈ విచక్షణ ఫలితంగా హెచ్ఎంటి, ప్రాగాటూల్స్ వంటి పెద్ద పరిశ్రమలు మూతపడే పరిస్థితికి వచ్చేశాయి. దేశంలో మొత్తం యంత్ర పరికరాల వ్యాపారం 800 కోట్లని అంచనా; 88-89లో 260 కోట్ల విలువైన యంత్రాలు దిగుమతి చేసుకొన్నాం. గత ఏడాది ఈ దిగుమతుల పరిమాణం 600 కోట్లకు పైనే. అంతమేరా దేశంలోని పరిశ్రమలు తమ వ్యాపారం కోల్పోయి నష్టపోయినట్లు లెక్క. ఇంతకు ముందు ఆర్థిక మంత్రి దిగుమతులకు ప్రత్యామ్నాయం అని మాట్లాడేవారు; ఇప్పుడది మానేశారు. దిగుమతులు పెంచి స్వదేశీ పరిశ్రమల పీక నులిమే స్తున్నారు.

రసాయనిక పరిశ్రమల పరిస్థితి మరీ ఘోరంగా వుంది. ప్రపంచంలోని అతి పెద్ద పెట్రో కెమికల్ పరిశ్రమలలో ఒకటిగా గుర్తింపు పొందిన ఐపిసిఎల్ ఈ రెండేళ్లలోనే మూతపడే స్థితికి వచ్చింది. హిందూస్థాన్ ఆర్గానిక్స్ లిమిటెడ్ సంస్థ ఫినాల్, అసిటైన్ రసాయనాల ఉత్పత్తి నిల్వ వేయాల్సినట్లుంది. ఆ రెండింటి మీదా మన్మోహన్ సింగ్ దిగుమతి సుంకం సగానికి పైన తగ్గించి వేశారు.

హిందూస్థాన్ జింక్ లిమిటెడ్ తన గనులు మూడింటిని మూసివేసింది. దిగుమతయ్యే సీసం చవకగా దొరకడమే అందుకు కారణం. సోడియం నైట్రేట్ తయారీలో భారత దేశం ప్రపంచంలో కెల్లా అత్యధిక ఉత్పత్తిదారు; కాని ఇప్పుడు చైనా పోటీకి తట్టుకోలేక ఆ పరిశ్రమలు మూత పడి పోతున్నాయి. నాఫ్తా, పాలిమర్స్ విషయాలలో కొరియా నుంచి వచ్చే దిగుమతులు మన పరిశ్రమల అంతం చూస్తున్నాయి. కాస్టిక్ సోడా, క్లోరిన్ పరిశ్రమల తలుపులు మూత పడుతున్నాయి.

మన్మోహన్ సింగ్ పనిగట్టుకొని ఈ పరిశ్రమల దావుమేళం వాయిస్తున్నారు. అందుకొక ఉదాహరణ - పారిశ్రామిక ఆల్కహాల్ ఉత్పత్తి. మొలాసిస్‌ను మొదట డీకంట్రోలు చేశారు. దాని ధర 140 నుంచి 1800 రూపాయలకు పెరిగింది. మొలాసిస్ ఆధారంగా తయారయ్యే అసిటిక్ యాసిడ్, పారిశ్రామిక ఆల్కహాల్‌పై దిగుమతి సుంకం తగ్గించారు. అందువల్ల విదేశీ రసాయనాలు చవకగా దొరుకు తున్నాయి. స్వదేశీ పరిశ్రమలు మూత బడ్డాయి. దిగుమతులు పెరిగి పోయాయి. మొలాసిస్ ధర నియంత్రణ రద్దు వల్ల రైతులు బాగుపడింది ఏమీ లేదు. ఒక్క బరోడాలో నాలుగు రసాయనిక పరిశ్రమలు మూసివేశారు. ఎన్ని వేల మంది దీనివల్ల నిరుద్యోగులౌతారో వూహించు కోవచ్చు.

ఒక పథకం ప్రకారం స్వదేశీ పరిశ్రమలను మన్‌మోహన్ సింగ్ పతనం చేస్తున్న విషయం- వినియోగదారుల వస్తువుల మార్కెట్ చూసినా అర్థమై పోతుంది.

## ఐఎంఎఫ్,వరల్డ్ బ్యాంకుల బెదరింపులకు లొంగి విదేశీవస్తువుల దిగుమతిపై సుంకం తీసి వేసి స్వదేశీ పరిశ్రమలపై పన్నులు పెంచు తున్నారు. ఫలితంగా ఎన్నో పరిశ్రమలు మూతపడి పోతున్నాయి; కోట్లాది మంది నిరుద్యోగులుగా మార బోతున్నారు; దేశానికి తీరని నష్టమిది!

## కలమేలు కోకుంటే దేశం సర్వ నాశనమే!

## విదేశీ సంస్థలు తమ ధనబలంతో, ఆర్థిక మంత్రి అండతో టాటాలు, బిర్లాలనే అణగ ద్రొక్కేస్తున్నాయి. ఫ్యాక్టరీలు మూసివేసి అంగళ్లు పెట్టుకొనే స్థాయికి పెద్ద పారిశ్రామిక సంస్థలు దిగజారి పోతున్నాయి. బ్రిటీషు పాలకుల నాటి దుస్థితికి నెట్టుతున్నారు మనల్ని!

## ఫేస్ పౌడర్లు లిప్‌స్టిక్‌లూ దిగుమతి చేసుకునే దుర్గతి!

## హెచ్‌ఎంటి వంటి పెద్ద సంస్థలూ మూతపడే దుస్థితి!

భారతదేశం నుంచి 1991-92 లో 6 వేల కోట్ల రూపాయల విలువైన కాటన్ వస్త్రా_లు ఎగుమతైనాయి. 13 లక్షల పవర్ లూమ్స్‌కు, కోట్లాది మంది చేనేత కార్మికులకు ఈ రంగం ఉపాధి కల్పిస్తున్నది. ఉన్నట్లుండి మన్మోహన్ సింగ్ కాటన్ దారం ఎగుమతికి అనుమతించారు. వ్యాపారులు 5 లక్షల బేళ్ల దారం విదేశాలకు పంపేశారు. దేశంలోని పవర్‌లూమ్స్‌కు దారం కొరత ఏర్పడింది. ఫలితంగా పవర్ లూమ్స్ ఆగిపోతున్నాయి. కనీసం కోటి మంది చేనేత కార్మికులు గత ఏడాది ఇవతల నిరుద్యోగులై పోయారు. ప్రభుత్వానికి ఎగుమతి

కొరవ 7 పేజీలో

## పివికి ప్రమాదం అర్థమైనట్లుంది!

శృతిమించిన సరళీకృత ఆర్థిక విధానాల వల్ల దేశ పారిశ్రామిక రంగానికి జరుగుతున్న ప్రమాదాన్ని ప్రధాని పివి నరసింహ రావు గుర్తించినట్లుగా కన్పడుతూంది. స్విట్జర్లాండ్‌లోని డావోస్ నగరంలో 2 తేదీ జరిగిన సమావేశంలో ఆయనీ విషయం స్పష్టంగా బయట పెట్టారు. భారత దేశాన్ని ఇక ఎంత మాత్రం బెదరించలేరని, ఒత్తిడి చేయలేరని ఆయన ఐఎంఎఫ్, వరల్డ్ బ్యాంకులతో పాటు, బహుళ జాతి కంపెనీలనూ హెచ్చరించారు. ఇండియా వ్యవహారాల పై ప్రత్యేకంగా జరిగిన ఈ సమావేశంలో, ఇండియాలో పెట్టుబడులు పెట్టబోతున్న 70 మంది బడా విదేశీ పారిశ్రామిక వేత్తలు కోరిన గొంతెమ్మ కోరికలను ఆయన నిర్ద్వంద్వంగా తిరస్కరించాడు. అధికారులు, ఆర్థిక మంత్రి ఆయనకు ముందుగా వారడగబోయే ప్రశ్నలు, సమాధానాలు అందించి నప్పటికి, వాటిని ప్రక్కన పెట్టి, వారికి తెలియకుండా తాను స్వయంగా ఉపన్యాసం వ్రాసుకొని, పాశ్చాత్య దేశాల వారు నిర్దేశించినట్లు ఆర్థిక సంస్కరణలు కొనసాగించడం ఇంక వీలు కాదని, విదేశీ సంస్థలు వేలమైళ్ల దూరంలో కూర్చొని జారీ చేసే ఆదేశాలు తాము పాటించమని, కమ్యూనిజం పతనమైనంత మాత్రాన ప్రపంచం యావత్తు మీ అడుగు జాడలలో నడవాలని నిర్దేశించడం తగదని కరకుగా హెచ్చరించారు. భారత దేశం ఆర్థిక సంస్కరణల విషయంలో తనకు నచ్చిన మార్గాన్ని మాత్రమే అనుసరిస్తుందని, ఇతరులు చెప్పిన మాటలు ఇక ఎంతో కాలం వినబోదని ప్రధాని చేసిన ప్రకటన, మన్మోహన్ సింగ్ ఆర్థిక సంస్కరణల ప్రభావం ఎంత విషపూరితంగా తయారౌతున్నదీ ఆయన అర్థం చేసుకున్నట్లు భావించాలి!

# పేదవాడి పై ప్రతాపం

పేద, మధ్య తరగతి ప్రజలను పన్నుల రూపంలో పీల్చి పిప్పి చేయడంలో మన్ మోహన్ సింగ్ ఇతర ఏ ఆర్థిక మంత్రులకూ తాను తీసిపోనని నిరూపించు కున్నారు. గతవారం రోజులుగా ఆయన ఒక్కొక్క వస్తువు పైనా పెంచుకుంటూ వెళ్తున్న పన్నులు, వాటి తీరు చూస్తుంటే ప్రపంచ బ్యాంకు అడిగితే మన వంటి మీద చొక్కా కూడా పెరుక్కొని వారికిచ్చేట్లున్నా రనిపిస్తూంది.

బడ్జెట్ సమర్పణకిక రెండు వారాలే వుంది వ్యవధి. తనను తాను అభివర్ణించు కున్నట్లు తాను ఆదర్శప్రాయుడైన ఆర్థిక మంత్రి అయితే, రాజకీయాలతో నిమిత్తం లేకుండా ఆర్థిక నిపుణుడిగా మాత్రమే తాను వ్యవహరిస్తుంటే - పెంచ దల్చుకున్న పన్నులు, ధరల విషయంలో ఆయన బడ్జెట్ పత్రంలో ఒక నిర్ణయం తీసుకొని వుండాలి; కాని మన్ మోహన్ సింగ్ అంత ఉదారుడేమీ కాదని, ఉదాత్త ఉద్దేశ్యాలుండే వాడూ కాదని ఇప్పుడర్థమౌ తున్నది.

మొదట ఆయన చక్కెర కంట్రోలు ధరను కిలోకు రూపాయిదాకా పెంచారు; ప్రక్క రోజే బియ్యం, గోధుమల ధరలు పెంచారు. ఆ తర్వాత గ్యాసు సిలిండర్‌ను మోయలేని బరువు చేశారు. చిట్ట చివరిగా పెట్రోలు, డీసెల్ ధరల పెంపుతో కరువు మండించారు.

విదేశీ దారులకిచ్చే సబ్సిడీలను తగ్గించాలని ప్రపంచ బ్యాంకు చాలా కాలం నుంచి వత్తిడి చేస్తున్నది. తామ మాట వినకుంటే అప్పులివ్వడం మానివేస్తామని బెదరిస్తున్నది. వారు విసిరేసే ముష్టి డాలర్ల కోసం ఆత్రంగా ఎదురు చూస్తుండే ఆర్థిక మంత్రి వర్యులు వారి ఆదేశాలను శిరసావహించి పేద ప్రజల పై వేటు వేశారు. చౌకడిపోలో అమ్మే నిత్యావసర వస్తువులకు, వాటి మార్కెట్ ధరలకు వ్యత్యాసం తగ్గించేందుకు నిస్సిగ్గుగా ప్రయత్నించాడు. దీనివల్ల 2000 కోట్ల రూపాయల ఆదాయం వస్తుందని ఆర్థిక మంత్రి చెప్తున్నప్పటికీ, వాస్తవంలో అంతకు రెట్టింపు భారం ప్రజల పై పడనున్నదన్న సంగతి బహిరంగ రహస్యమే! బియ్యం, చక్కెర, గోధుమలు ఇక నుంచి చౌక డిపోలలో కొనడం అనవసరమనే అభిప్రాయానికి ప్రజలు తమంతటు తాముగా రావాలన్నది ఆర్థిక మంత్రి ఉద్దేశ్యంగా వున్నట్లుంది.

సంక్షేమ ప్రభుత్వమనే పేరుతో రాజ్యం చేసే పెద్దలు పేద ప్రజల నోరు కొట్టడానికి ఇటువంటి నిర్ణయం తీసుకోవడం ఘోరం, దారుణం. దిగుమతి సుంకాలు ఎక్సైజ్ రాయితీల రూపంలో వేలాది కోట్ల సబ్సిడీలను పెద్ద పారిశ్రామిక సంస్థలకు, బహుళ జాతి కంపెనీలకు దోచి పెడ్తున్న ప్రభుత్వం పేదవాడి ఆకలి కడుపును మరింత ఎండగట్టి, వాడి రక్తమాంసాలను పిండి తన ఆర్థిక లోటును పూరించు కోవడానికి కుట్ర పన్నడం దారుణ అన్యాయం.

పెట్రోలు, డీసెల్ ధరల పెంపు వల్ల కూడా చితికి పోయేది సామాన్యుడే. వీటి రెండింటి వల్లా రవాణా ఖర్చు పెరిగి అన్ని నిత్యావసర సరకుల ధరలూ అపరిమితంగా హెచ్చుతాయి. ప్రపంచ మార్కెట్‌లో పెట్రోలు ధరలు పడిపోయి, గల్ఫ్ దేశాలు తమ ఉత్పత్తిని తగ్గించుకునే సమయంలో ధరలు పెంచడానికి కారణమేమిటో అనూహ్యం. చంద్రశేఖర్ ప్రభుత్వ హయంలో విధించిన గల్ఫ్ యుద్ధం సర్‌ఛార్జిని పరిస్థితి కుదుట పడగానే తొలగిస్తామని మన్‌మోహన్ సింగ్ మొదట్లో వాగ్దానం చేశారు. అది మర్చిపోయి ఇప్పుడు మళ్లీ ధర పెంచారు. ఆర్థికంగా అత్యంత హీన స్థితిలో వుండే ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలో సైతం పెట్రోలు ఖరీదు మనకంటె తక్కువగా వుందన్న సంగతి ఇక్కడ గమనించాలి.

పన్నులు పెంచవచ్చు; ధరలు హెచ్చించవచ్చు. పెరుగుతున్న అవసరాలకు తగినట్లు ధరలూ, పన్నులూ పెంచకుంటే ప్రభుత్వ నిర్వహణ అసాధ్యం. కాని అందుకు పేదల పై భారం వేయడం సమంజసమా? దిగుమతి సుంకాలు తగ్గించి విదేశీ కంపెనీలకు వేలాది కోట్ల ప్రయోజనం చేకూర్చి పెడుతూ, ఆ లోటును బడుగు వర్గాల నుంచి దౌర్జన్యంగా లాక్కోజూడడం ధర్మమా? ఆర్థిక మంత్రి ఆలోచించాలి. డంకెల్ ఒప్పందంలో, చౌక డిపోల రద్దు కూడా ఒక అంశం. అటువంటిదేమీ లేదని ప్రభుత్వం దబాయిస్తున్నది. ఇప్పుడు బియ్యం, చక్కెర, గోధుమల ధరల పెంపకం తీరు చూస్తే దొడ్డి దారిన చౌక డిపోలను నిర్వీర్యం చేయడానికి ప్రయత్నిస్తున్నారా అన్న సందేహం కల్గుతూంది.

కేంద్రం పెంచిన బియ్యం ధర వల్ల రాష్ట్ర ప్రభుత్వం పై సబ్సిడీ బియ్యం పథకం కొనసాగింపుకు 290 కోట్ల భారం పడుతూంది. అసలే ఎక్సైజ్ ఆదాయం పోయి ఏడుస్తున్న రాష్ట్ర ప్రభుత్వానికి ఇది మూలిగే నక్క మీద తాటికాయ వంటిదే. సబ్సిడీ బియ్యం ధర పెంచేది లేదని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఎన్నికల సంవత్సరం కాబట్టి ఆయనా నిర్ణయాలు తీసుకోవలసి వచ్చి వుంటుంది. కాని ఇంత పెద్ద భారం భరించేదెట్లా? దీనివల్ల అసలే అంతంత మాత్రంగా వున్న అభివృద్ధి కార్యక్రమాలు, విద్యుత్ నీటి పారుదల ప్రాజెక్టులు నిల్చిపోయే ప్రమాదం లేదా? మన నాయకులు ఎవరి అవసరాల కనుగుణంగా వారు నిర్ణయం తీసుకొని దేశాన్ని అధోగతి పాల్జేసేట్లున్నారు.

జమీన్‌రైతు

## జనవాణి

# కూటి కోసం శవాలు మోసే బ్రాహ్మణులూ అగ్రవర్ణీయులా?

కాన్షీరాం గారి రెచ్చగొట్టె వుపన్యాసాల వల్ల దేశం భవిష్యత్తులో ఎంత బీభత్స కాండను చూడవలసి వస్తుందో నన్న బాధ ఇప్పటి నుండే మొదలైంది. ఆయన ఎంత అరచి గీ పెట్టుకొన్నా దక్షిణాదిలో ఆయన పప్పులేవీ వుడకవు. బడుగు వర్గాల సంక్షేమాన్ని ఆ వర్గాల వారే కాంక్షించరు. వీరిలోని వారు పదవులు పొందిన తర్వాత వారి వర్గాలకు ఏ సహాయమూ చేయడం లేదు. అందలమెక్కిన మరు క్షణమే ఎసి కార్లనో, బంగళాలనో సంపాదించు కోవాలనే తాపత్రయం తప్పితే ఏదైనా సహాయానికి తోడ్పడ్డారా? ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్. ఐ.ఎఫ్.ఎస్. అయిన అధికార్లు కనీసం తాము పుట్టి పెరిగిన గ్రామాల వైపుకు పోతున్నారా అన్న విషయం వారే ఒక్కసారి ఆలోచించు కొంటే చాలు. బ్రాహ్మణుల పై విషం గ్రక్కడం బాధాకరం. బ్రతకలేక పొట్ట గడపడం కోసం శవాలు మోసే బ్రాహ్మణులు, గుగ్గిళ్లు అమ్ముకునే వైశ్యులు, పాలు, మజ్జిగ అమ్ము కొనే రెడ్లు, కమ్మ వాళ్లు గ్రామీణ ప్రాంతాలలో ఎందరు లేరు చెప్పండి. వీరందరూ అగ్రవర్ణాల వారౌతారా?

నెల్లూరు -టి.వి. నారాయణ

### హోమో సెక్సువల్స్‌కు సెక్స్ థెరపి

హోమో సెక్సువల్స్ అన్ని దేశాలలోనూ వున్నారు. అన్ని రంగాలలోనూ ప్రసిద్ధులు, సమర్థులైన స్త్రీ, పురుషులలో కొందరు హోమో సెక్సువల్సే. సాధారణంగా సమాజం వీళ్లను అవమానిస్తుంది. బంధు, మిత్రులు అసహ్యించు కుంటారు. ఆ కారణంగా కొందరు మానసికంగా కృంగిపోయి ఆత్మహత్యలకు పాల్పడుతుంటారు. కాని ఇక్కడ ప్రతి ఒక్కరూ ఒక విషయాన్ని నిష్పాక్షికంగా పరిశీలించాలి. హోమో సెక్సువల్స్‌ను అసహ్యించు కోవడం లేక అవమానించడం మూలంగా వాళ్ల ప్రవర్తన మారదు. ప్రస్తుతం సెక్సాలజిస్టులు సెక్స్‌థెరపి ద్వారా వాళ్ల ప్రవర్తనలో పరివర్తన తేగలుగుతున్నారు.

-డా. ఇ. రాజగోపాల రెడ్డి

నెల్లూరు

### పార్ట్ టైమ్ లెక్చరర్స్‌కు అన్యాయం

కాలేజీల్లో పార్ట్ టైం లెక్చరర్లుగా పనిచేస్తు వారి పట్ల ప్రభుత్వం సవతి తల్లి ప్రేమ చూపిస్తున్నది. కాలేజీల్లో పనిచేస్తున్నా వారు బోధించిన పాఠ్యాంశాలకు సంబంధించిన థియరీ పేపర్లు దిద్దడానికి, ప్రాక్టికల్స్ పర్యవేక్షణ; అనుమతించక పోవడం బాధాకరం. అదే విధంగా ఎం.ఫిల్ ఎంట్రెన్స్‌లో పాసైన పార్ట్ టైం లెక్చరర్లకు ఎం.ఫిల్ ప్రైవేటు అభ్యర్థులుగా పార్ట్ టైంగా చేసే అవకాశాన్ని కల్పించాలి.

- కె. సుజాత నాగరాజారావు

కావలి

### ప్రగతి శీల భావాలు గల పార్టీ ముందుకు రావాలి

ఏ విధంగా చూసినా శ్రీ కాన్షీరాం బహుజన సమాజ్ పార్టీ కులతత్వాన్ని రెచ్చ గొట్టేది గానే వుంది. ఇప్పటికే కొన్ని పార్టీలు భారత జాతిని మతాలు, కులాల వారీగా విభజించాయి. బి.ఎస్.పి. వర్గ

కొరవ 10 పేజీలో

4.2.1944

పేజీలు 6, వెల 0-1-6

### గ్రామసీమలు

#### కృష్ణాపట్నం

20 తేది కృష్ణలీల మొదటి కృష్ణుని తొక్కు పల్కులు, నందుని మధుర గానము ప్రేక్షకుల నాకర్షించినవి. తీర్చి దిద్దిన హార్మోనిస్టుకు, సహాయ పడ్డ పెద్దలకు అభివాదాలు. ఈ సమాజం పెద్దల పార్టీ కలహాల్లోకి చొచ్చుకోక అభ్యుదయ మార్గాన నడచు గాక.

-ప్రేక్షకుడు.

#### రాపూరు

పంచాయతీ బోర్డు టీచర్ల జీతాల బిల్లులు తాలూకా ట్రెజరీకి పోతుంటే పాలచెట్టు, బీరచెట్టు, ముష్టిచెట్టు తలా ఒక రూపాయి యివ్వాలి. లేకుంటే అడ్డుపడతా యంటయటనే? అట్లా అడ్డుపడితే వృక్షరాజం 'అశ్వర్థం' తో చెప్పవలసి వస్తుంది సుమా? భద్రం!

- ఒకరు

జమీన్‌రైతు

#### కోవూరు తా..

కిర్చినాయిల్ తాలూకా సప్లయి తక్కువ. రేషన్ చీట్లు వచ్చి చాలాకాలమైనా పల్లెల్లో బట్వాడా కాలేదు. తహసిల్‌దారు గారి చూపు కొంచెం యిటు త్రిప్పకూడదా?

-బాధితుడు

#### ముత్తుకూరు

డాక్టరు గారి దృష్టి కొంచెం మారాలె.

- ఒక రోగి

#### ఆత్మకూరు

కలరా బూచి భీకరాకారంతో బెదిరిస్తున్నా, పంచాయితీ బోర్డువారి "ఫినాయిల్" డబ్బాలు బయటకు రామంటున్నవే మార్గమెట్లా?

సత్రం దగ్గర పదిమంది పరమానందాయ గారి శిష్య ముఠావారు ఒక యువకుని మీదకు కుప్పించి దూకటం, ఆ యువకుడు గాండీవం ఎక్కుబెట్టి సరికి కాలికి బుద్ధి చెప్పటం....ఇది బోల్షివిక్ రిట్రీటా? లేక స్ట్రాటెజికల్ విశ్రాయులో?

పార్టీ ఫండు అంటూ పల్లెల మీద కొలిగట్టిన వసూలు మొత్తంలో చిల్లర దేముళ్లకు భాగం లేదంటాడటనే మూల విరాట్, వాళ్ళకు గూడ పంచియిస్తే ఏం కొంప మునిగింది?

-నేనే.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

#### ఆంధ్రసభ

"పదిపావులు యిచ్చి అయినా దుష్టసహవాసం వదులు కోవలెను"

వెనక నెల్లూరు గొప్పవాళ్ళలో జేరిన ఒక వక్రబుద్ధి, రేబాల లక్ష్మీనర్సారెడ్డి గారి వద్దకు పోయి పదివేల రూపాయలు తనకు అప్పుయివ్వమని అడిగాడట. అపూర్వ లౌకిక జ్ఞానియగు రెడ్డిగారు తక్షణమే రు 500ల నోట్లు రెచ్చి అతని జేబులో బెట్టి, నాయనా! ఇవి ఉచితంగా తీసుకో, నన్ను అప్పు అడుగ వద్దు అని మంచిగా చెప్పి పంపేశాడట. అంటే పదిపావులు యిచ్చి అయినా దుష్టసహవాసం వదులుకున్నాడన్న మాట.

లోకం ఇలావుంటె తద్విరుద్ధంగా ఆంధ్రసభ వారు మాత్రం, పదిపావులు ధారబోసైనా దుష్టసహవాసం కొందామంటారటనే! ఏమిటయ్యా యీ చాదస్త్రం?

- టి.వి

కొరవ 10 పేజీలో

గులాబిలు, చేమంతులు గ్లాసు ఇళ్లలో పెంచితే విదేశాలలో విపరీతమైన గిరాకీ వుంది!

# అందమైన పూలతో రైతుకు లాభాలెన్నో!

డాక్టర్ సిద్దారెడ్డి ఈశ్వరరెడ్డి
ఎంఎస్‌సి, పి.హెచ్.డి.

పూలు, మన సంస్కృతి వేద కాలం నుంచి (3000-2000 క్రీ.పూ) నుంచి పెనవేసుకొని ఉన్నాయి. ఋగ్వేదం (3000-2000 క్రీ.పూ). రామాయణం (1200-1000 క్రీ.పూ). మహాభారతాలతో పాటు సంస్కృతంలో రచనలు చేసిన శూద్రక (100 క్రీ.పూ). అశ్వఘోష (క్రీ.శ 100) కాళిదాస (5వ శతాబ్దం) సారంగధర (13 వ శతాబ్దం) మహాకవులు తమ రచనల్లో పూలు, ఉద్యాన వనాల గురించి ఎంతో విపులంగా వర్ణనలు చేసి ఉన్నారు.



ప్రాచీన సాహిత్యంలో పేరు పొందిన నాటక కర్త కాళిదాసు తన అభిజ్ఞాన శాకుంతలంలో స్పష్టంగా రసమయంగా పూలను, తోటలను వర్ణించి మనకు ప్రకృతి సౌందర్యాన్ని కనులకు కట్టినట్లుగా చూపెట్టిన ఘనత పొందారు.

హిందూ, బౌద్ధ దేవాలయాల్లో మానసిక పరిపక్వతను కలిగించేందుకు ఎన్నో రకాల పూల మొక్కలను, చెట్లను పెంచి పోషించేవారు. ఆవరణలో పూలతోటలను పెంచడమనే కళ మొగలు చక్రవర్తులచే 16, 17 శతాబ్దాలలో ఆదరింప బడింది. ఇంతెందుకు, కొండవీటి రెడ్డిరాజుల ఆస్థాన కవి శ్రీనాధుడు అనాడు శివుడిని అలంకరించి, అభిషేకించిన పూలను రమ్యంగా వర్ణించి, మన చుట్టూ ఉన్న చిన్న విషయాలను ఎంత కమనీయంగా వర్ణించి, ఆనందింప జేయ వచ్చే తెలియ చెప్పి మనకు పూల పట్ల, వాటి సౌరభం పట్ల ఆసక్తి కలిగిస్తారు.

ఇటువంటి పూలు నేడు మనకు ఆర్థికంగా లాభాన్ని చేకూర్చే ప్రకృతి ప్రసాదితాలుగా మారుతున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా 1991 లో 24 బిలియన్ డాలర్ల వ్యాపారం పూలు వాటి పదార్థాల అమ్మకం ద్వారా జరిగింది. ఈ మొత్తంలో అభివృద్ధి చెందిన దేశాలు 90 శాతం వ్యాపారాన్ని చేశాయి. వీటిలో ఎక్కువ భాగాన్ని యూరోపియన్ దేశాలు దిగుమతి చేసుకోగా, అభివృద్ధి చెందుతున్న దేశాలు ఎగుమతి చేశాయి.

పూలను ఎగుమతి చేయడంలో నెదర్ ల్యాండ్స్ ప్రముఖ స్థానాన్ని (64.3%) ఆక్రమిస్తుంది. అలంకరణకు అవసరమయ్యే మొక్కల ఆకులను ఎగుమతి చేయడంలో ఇటలీ ప్రథమ స్థానంలో ఉంది. జర్మనీ దేశంలో పూల వాడకం ఎక్కువ. అందువల్ల దిగుమతి చేసుకొనే దేశాల్లో ముఖ్యస్థానం వహిస్తుంది. గత దశాబ్దంలో జర్మనీలో సంవత్సరానికి 10 శాతం చొప్పున పూల అవసరాలు పెరుగుతున్నాయి. యూరోపియన్ దేశాలు, అవి ఉత్పత్తి చేసే పూలు చాలక, దిగుమతులు చేసుకుంటున్నాయి. ఉదాహరణకు జర్మనీలో ఉత్పత్తి అయ్యే పూలు 42 శాతం అవసరాలను మాత్రమే తీరుస్తుండగా మిగతా 58 శాతం అవసరాలకు దిగుమతి మీద ఆధార పడి ఉన్నది. అందుకుగాను, హాలండు, ఫ్రాన్సు, ఇటలీ, ఇజ్రాయిల్, దక్షిణ ఆఫ్రికాల మీద ఆధారపడి ఉంది. యూరోపిను మార్కెటుకు నవంబరు నుండి ఏప్రెలు వరకు దిగుమతి అయ్యే పూలు ఎక్కువ మొత్తంలో ఉంటాయి. ఈ కాలంలో ఆ దేశాల్లో పూలకు కొరత ఉండడమే గాక రేట్లు గూడ 50 శాతం అధికంగా ఉంటాయి.



అందువల్ల ఉష్ణప్రాంతాలకు చెందిన అభివృద్ధి చెందుతున్న దేశాలు- నవంబరు నుండి ఏప్రెలు వరకు అక్కడ వాతావరణం వేడిగా ఉండడంతో, పూలను ఉత్పత్తి చేసి యూరోపియన్ దేశాలకు ఎగుమతి చేయడం మొదలు పెట్టాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలైన ఇజ్రాయిలు, కొలంబియా, బ్రెజిలు, కెన్యా, ఐవరీ కోస్టు, థాయ్‌ల్యాండ్, శ్రీలంక, సింగపూరు, దక్షిణ ఆఫ్రికాలో పూలను ఎక్కువగా ఎగుమతి చేస్తున్నాయి.

పూలను ప్రత్యేకించి గులాబి, గ్లాడియోలస్ (GLADIOLUS) లను యూరో పేకు ఎగుమతి

కొరవ 11 పేజీలో

# నెల్లూరీయుల ఆస్తులు జుల్మానాలకే చెల్లు!

చెన్నపురిలో నెల్లూరీయుత
ప్రొఫెసర్ అచ్చిరెడ్డి,
ఎం.ఎ.పి.హెచ్.డి.

గత సంచిక తరువాయి

పాపయ్య వ్యాపార వాణిజ్య సహచరులైన కొందరు ఇంగ్లీషు వారు తెలివిగా తప్పుకొంటే, ప్రధాన నిందితులైన హాలండు సోదరులు (Holand Brothers) తమ నేరాలు తప్పించు కొనే ఎత్తుగడలో భాగంగా వెంటనే ఇంగ్లాండుకు పారిపోయారు. పాపయ్య మాత్రం తన నిర్దోషిత్వాన్ని నిరూపించు కోవాలన్న పట్టుదలతో చెన్నపురిలోనె వుండి పోరాడారు. దాదాపు 46000 పగోడాల అప్పును నవాబు మీద పాపయ్య మోసంగా మోపినట్లు ఈ నేరాలలో ఒకటి. నవాబు గారి చేపాక్ భవనంలో లెక్క పద్దులు వ్రాసే రాయారెడ్డి ఈ మేరకు 1790 నాటికి తప్పులు వ్రాసినాడని పాపయ్య వాదించారు. దాదాపు రెండు దశాబ్దాల తర్వాత కూడా ఈ ఆరోపణలు, కేసులు నిగ్గు తేలక పోవడంతో 1809 వ సం.లో పాపయ్య గతించారు. పాపయ్య తోటి కలిసి పనిచేసిన సహచరులు, అనుచరులు చాలా మంది నెల్లూరీయు లనుట సమంజసం. వీరిలో రెడ్లు, కోమట్లు అధికులు. కొందరు మాత్రం దేశూరి, పంటు, పాకనాటి తెగలకు చెందిన వారు. వ్యవసాయం, వ్యాపారం, రెడ్డి తనం వీరి ముఖ్య వృత్తులు. వీరు చెన్నపురికి ఏఏ సంవత్సరాలలో వెళ్లారనేది తెలియదు.

పాపయ్యకు ఎదురుగా ఫోర్జరీ కేసులో నిందితులైనట్టి రాయపు రెడ్డి సోదరులు కర్ణాటక నవాబు వద్ద ఖర్చులు, అప్పుల ఖాతాలను వ్రాసేవారు. వీరి స్వస్థలాన్ని గూర్చి ప్రత్యక్ష వివరాలు దొరకలేదు. అవధానం పాపయ్య మాత్రం చాలా దస్తావేజుల్లో నెల్లూరు పాపయ్యని పిలువబడగా, ఆయన తోటి సన్నిహిత లావాదేవీలు గల స్థానికులను, వ్యాపారులను ఆ కాలంలో నెల్లూరి వర్తకులని, నెల్లూరి శెట్లని, లేదా నెల్లూరు రెడ్లు, నాయకులని వ్యవహరించు చుండే వారు. పాపయ్య దురదృష్ట మేమంటే 1746 - 1800 సం.ల మధ్య కాలంలో చెన్నపురిలో నెల్లూరీయుల ప్రాధాన్యత కొంత సడలింది. ఈ కాలంలో దక్షిణ జిల్లాల నుండి చాలా మంది తమిళులు చెన్నపురికి చేరారు.

ఇందుకు కారణాలు తెలియవు; కాని కొన్నిటిని సులభంగా పట్టవచ్చు. మదరాసు నగరాన్ని 1746 సం.లో ఫ్రెంచి వారాక్రమంచి నపుడు చెన్నపురిలో అధిక సంఖ్యాకులుగా వుండిన తెలుగు వారు ఫ్రెంచి సైన్యంలోని సాటి తెలుగు తమిళ సైనికులతో పోరాడడానికి నిరాకరించి నారనేది ఒక నింద. తర్వాత వరుసగా 1750 - 1800 మధ్య కాలంలో పడమటి వైపు నుంచి హైదరాలీ, మరాఠాలు, మొదలగు వారు చేసిన దాడులలో కూడా తెలుగు సైనికులు విరివిగా నుండడం వల్ల చెన్నపురి తెలుగు వారంతగా పోరాడలేదని ఆరోపణలు వచ్చాయి. చాలా వరకిట్టి కారణాల వల్ల కంపెనీ ప్రభుత్వపు కరుణను కోల్పోయిన చెన్నపురి వాసులైన నెల్లూరీయు లెందరో తిరుగు ముఖం పట్టారు. అవధానం పాపయ్య కేసులో నడిచిన వివిధ ఘట్టాలలో ఈ అంశాలున్నాయి. పాపయ్య ఖైదులో వున్న మూడు సం.లలో ఈయన అనుయాయులకు చెన్నపురిలో నిలువ నీడ లేక పోగా నెల్లూరు ప్రాంతానికి వెనుదిరిగారు. నగర శ్రీమంతుడైన పాపయ్యకు చెందిన ఆస్తులన్నీ హరించుక పోగా నెల్లూరు బ్రాహ్మణులకు చెన్నపురిలో శరణు కరువైంది. ఆస్తులన్నీ పోయినా చెన్నపురిలోని చూలైలో ఇప్పటికినీ అవధానం పాపయ్య వీధి మాత్రమున్నది.

ఈ పాపయ్య తరాంతంలో నెల్లూరు వారు చెన్నపురిలో తరగి పోవుతున్న తమ ఆధిక్యతను తెలిసి కొన్నారు. కాని చేసేదేమీ లేక పోయింది. 1800 - 1801 లో మొత్తం కర్ణాటకకు ఆంగ్లేయ కంపెనీ వారు పాలకులైనారు. క్రొత్తగా ఏర్పడిన పాలనా పరమైన ఉద్యోగాలలో నెల్లూరు వారికే ప్రాధాన్యం లేక పోయింది. అప్పటికి కూడా శ్రామిక కులాల వారి మధ్య సఖ్యత రాలేదు. నౌకర్లలో అధిక సంఖ్యలో తమిళ వారు చేరారు.

అవసరం తీరగానే ఆనాటి తమ నౌకర్లయిన ఆంధ్రుల మీద తప్పుడు ఆరోపణలు మోపి, జుల్మానాలు విధించి, ఆస్తులన్నీ హరించి వేసే వారు ఆంగ్లేయులు. అయినా మన వారు వారికి సేవలు చేయడానికి లంచాలిచ్చి మరీ పోటీలు పడే వారు.

రాజకీయ ప్రాముఖ్యం కూడా చాలా వరకు తంజావూరు మొదలైన దక్షిణ ప్రాంతాలకు తరలింది. నవాబుల పతనంతో నెల్లూరీయుల దశ చెన్నపురిలో తగ్గి పోవుటకు ప్రత్యేక సంబంధిత కారణాలు దొరకవు.

నెల్లూరు (మొదటి) పాపయ్యకు అనుయాయులు, సమకాలికులు అయిన వారిన గూర్చి చాలా ఆసక్తి కరమైన విషయాలున్నాయి. 1716 వ సం.లో చెన్నపురిలో వామ హస్త - దక్షిణ హస్త కులాల వారి మధ్య చెలరేగిన తగాదాల్లో నెల్లూరీయులైన రాయసం పాపయ్య, గూడా అంకన్నల హస్తమున్నట్లుగా ఆరోపించ బడింది. వృద్ధుడైన గూడా అంకన్న 1716 నాటికి దాదాపు 60 సం.గా ఇంగ్లిషు

కొరవ 10 పేజీలో

## జిల్లా వార్తలు

## బూదనం నిమ్మ రౌడీలు

ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి పండించిన పంట చేతి కందక పోవడంతో బూదనం గ్రామ రైతులు పడరాని పాట్లు పడుతున్నారు. బూదనం గ్రామ పరిసర ప్రాంతాల్లో పంద ఎకరాలకు పైగా భూమిలో నిమ్మ చెట్లు వేసి సామాన్య, మధ్య తరగతి రైతులు బ్రతుకు తెరువును ఎంచుకొన్నారు. పూత కొచ్చిన నాటి నుండి కాపు కొచ్చే వరకు రేయింబవళ్లు కష్టపడుతుంటే గూడూరుకు చెందిన కొందరు అక్రమ వ్యాపారులు ఈ తోటల పైకి రాత్రుల్లో దొంగలను ఎగ్రదోలి సులభంగా పండుకోటే మార్గాలను ఎంచుకొన్నారట. దీని కోసం స్థానికంగా అల్లరి చిల్లరగా తిరిగే ఒక రౌడీ మూకను తయారు చేసుకొని రైతుల పైకి మూక బలంతో తిరిగి బడుతున్నారట. బక్క చిక్కిన రైతులు వీరి దెబ్బకు హడలి చచ్చి పోతున్నారు. పోలీసుల దృష్టికి తీసుకెళ్లినా తగిన స్పందన లేదని వాపోతున్నారు. డి.ఎస్.పి రామకృష్ణగారూ ఒకసారి బూదనాన్ని సందర్శించి రైతుల కష్టాలను గట్టెక్కించ గలిగితే పదికాలాల పాటు తమ పేరు చెప్పుకుంటారు.

× × ×

## గోగులపల్లి స్వాహా ఫిర్యాదు

జవహర్ రోజ్‌గార్ పథకాల వల్ల పల్లెలు బాగు పడినా, పడక పోయినా సర్పంచ్‌లు వారి అనుకూల సభ్యులు, బంధువులు మాత్రం బాగు పడి పోతున్నారు. వేలాది రూపాయల నిధులు వెంటనే ఖర్చు చేయకపోతే మురిగి పోతాయని మండలాధి కారులు తాకీదు మీద తాకీదులిస్తుంటే సర్పంచ్‌లు మాత్రం ఏం చేస్తారు చెప్పండి. అల్లూరు మండలం తూర్పు గోగులపల్లి పంచాయితీ కథ కూడా ఇటువంటిదే. ఎప్పుడో తాతల నాటి కాలంలో పంచాయితీ ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన బద్దెల దొడ్డి కట్టి పుణ్యాం కట్టుకొని పోయారు పెద్దలెవరో! గోగులపల్లి రైతులు మొన్నటి వరకు ఉప్పు సాగు ఇప్పుడేమో రొయ్యల సాగు పై మోజు మళ్లిస్తుండడంతో వ్యవసాయం చేసేవారు తగ్గిపోవడంతో బందెల దొడ్డి వరకు వచ్చే పశువులు లేక వున్న దొడ్డి పుసూరు మంటున్నది. రోజ్‌గార్ నిధులు వేలాది రూపాయలు వస్తున్నాయి; హరిజన, గిరిజన కాలనీలకు రోడ్లు వెయిస్తే పేరు తప్పు పైసలు మిగలవని తలపోశాడేమో సర్పంచ్ గారు తన వర్గీయులకు కాంట్రాక్ట్ ఇచ్చేందుకు నిధులు త్వరగా ఖర్చు చేసేందుకు మరో బందెల దొడ్డి నిర్మాణానికి 40 వేల రూపాయలతో ప్రతిపాదనలు సిద్ధం చేసి పంపారని గ్రామస్థుల గోడు. ఈ విషయాలను జిల్లాలోని సంబంధిత అధికారులందరికి స్వయంగా కలిసి విన్నవించారట. ఇంకా ఎవరూ పరిశీలించినట్లు లేదు.

× × ×

## రాపూరులో ఎమ్డీఓ లేడు

జిల్లాలో ప్రధాన మండల కేంద్రమయిన రాపూరుకు గత రెండేళ్లుగా మండల అభివృద్ధి అధికారి లేక పోవడం వల్ల ప్రజలు పడరాని పాట్లు పడుతున్నారు. ఏ పనికైనా ప్రజలు ఆఫీసుకు పోతే సమాధానం చెప్పే అధికారే లేడు. గత రెండేళ్లుగా వ్యవసాయ అధికారే ఇన్‌ఛార్జిగా కొనసాగు తుండడంతో పలు సమస్యలు వుత్పన్న మవడమే గాక ఆయన ఏ పోస్టుకూ న్యాయం చేయలేక పోతున్నారట. ఆఫీసులో వున్న కొద్ది సమయంలో ఆయనకు వుపాధ్యాయులకు మధ్య తగవులకే సరిపోతుందట. అయ్యా డి.డి.పి. గారూ మీరనుకుంటే ఎండిఓ పోస్టింగ్ ఎంత పని?

## విడవలూరులో విద్యార్థులకు ప్రోత్సాహం

విడవలూరు రైతులు గ్రామ సమస్యల పై పార్టీల కతీతంగా

కొరవ 7 పేజీలో

V.R.COLLEGE
SCIENCE CENTRE, NELLORE

వి.ఆర్. కాలేజి సైన్సు సెంటర్ జరిపిన ప్రొఫెసర్ మహలనోబిస్ జయంతి వేదిక పై ప్రిన్సిపల్ డాక్టర్ గోపాలకృష్ణమూర్తి, ప్రొఫెసర్ ఎం.వి. శాస్త్రి, ఆనం వివేకానంద రెడ్డి, డాక్టర్ కె.వి.ఎస్. శర్మ, తూపిలి సుందర రామిరెడ్డి

# విఆర్ కాలేజిలో ఆడిటోరియం

ఇటీవలే విఆర్ కాలేజిలో ఏర్పాటైన సైన్సు సెంటర్‌కు విద్యార్థుల నుండి అనూహ్యమైన స్పందన లభిస్తున్నది. ఈ సెంటర్ పెట్టే సభలకు కాలేజిలో ఏ గదీ చాలడం లేదు. 29 తేది సైన్సు సెంటర్ జరిపిన ప్రొఫెసర్ పి.సి.మొహలనోబిస్ శత జయంత్యు త్సవానికి భారీగా విచ్చేసిన విద్యార్థులను చూసి కాలేజి కమిటీ కార్యదర్శి శ్రీ ఆనం వివేకానంద రెడ్డి ఇక క్లాసురూమ్‌లు సమావేశాలకు చాలవు; ఒక ఆడిటోరియం కట్టి తీరాల్సిందేనన్నారు. కాని అందుకు ఒక షరతు విధించారు. ఇకనుండి తాను హాజరయ్యే ప్రతి సైన్సు సభ విద్యార్థులతోకళకళలాడితే ఆ పని చేస్తారట. ఆడిటోరియం కట్టిస్తానంటే విద్యార్థులు రాకుండా వుంటారా చెప్పండి!

వివేకానందరెడ్డి అధ్యక్షత వహించిన ఈ కార్యక్రమానికి వెంకటేశ్వర యూనివర్సిటీ సాంఖ్యక

కొరవ 8 పేజీలో

## నెల్లూరు సంగతులు

# శ్రద్ధాంజలి

## కాటంరెడ్డి గోపాలకృష్ణారెడ్డి గారు

స్వర్గస్తులై నేటికి సంవత్సరం. వారిని సంస్మరిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

భార్య: శశికళ

| | | | |
|---|---|---|---|
| కుమారులు | : | నరహరి రెడ్డి | ప్రవీణ్‌రెడ్డి |
| కోడళ్ళు | : | అనిత | శశి |
| మనుమలు | : | యశ్వంత్ | ప్రశాంత్ |
| సోదరుడు | : | శ్రీధర్ రెడ్డి | |

జననం : 6.4.1933 మరణం: 4.2.1993

## నెల్లూరు వీధుల్లో
### విమర్శకుడు

### జనార్ధనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లిజనార్ధనరెడ్డి మిజోరాం, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, హిమాచల్ ప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలో కాంగ్రెస్ పార్టీ పరిస్థితిపై జరిపిన అధ్యయనం, పర్యటన ముగిశాయి. 6 తేది తిరిగి హైదరాబాదు వస్తున్నారు.

### మంత్రులు

రోడ్ల మంత్రి శ్రీ టి. పురుషోత్తమ రావు, అటవీమంత్రి శ్రీ పనల పెంచలయ్య, దేవాదాయ మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి, మైనారిటీల మంత్రి శ్రీ మహమ్మద్ అలీ షబ్బీర్ ఈ వారంలో నెల్లూరు వచ్చారు.

### మాడరన్ స్కూలు
### ఎగ్జిబిషన్

ఉన్నత విద్యా ప్రమాణాలను పాటించే అతి కొద్ది నెల్లూరు స్కూళ్లలో ఒకటి-మాడరన్ స్కూలు- తన పిల్లలలో సృజనాత్మకతను పెంచను వారిచేత చిన్న చిన్న చేతి పని వస్తువులు తయారు చేయించి, ఎగ్జిబిషన నిర్వహిస్తున్నది. ఎంబ్రాయిడరీ, పెయింటింగ్ ల నుంచి పూల అలంకరణ వరకు వుండే ఈ ప్రదర్శన 14 తేది స్కూలు ఆవరణలో జరుగుతుంది. వాటిని చూసి, పిల్లలను ప్రోత్సహించమని పిలుస్తున్నారు శ్రీ విజయ కుమార్ రెడ్డి.



### లారీ ప్రమాదం-
### ఇద్దరి చావు!

మృత్యు పిశాచి ఏ రూపంలో ఎప్పుడు ఎవర్ని కబళిస్తుందో అనూహ్యం. దాన్ని కనిపెట్టడం ఎవరి తరమూ కాదు. 2 తేది వేకువ ఝామున దర్గామిట్ట నిప్పో ఎదురుగా జరిగిన లారీ ప్రమాదం చూస్తే గుండె బేజారై పోతుంది. వేకువన 4.30 గంటలకు మద్రాసు నుంచి విజయవాడ వైపు వెళ్తుండిన ఒక లారీ (టిఎన్ఎస్ 8985)ఉన్నట్లుండి అదుపు తప్పి, నిప్పో ఎదురుగా రోడ్డుకు తూర్పువైపుకు లాగేసింది. మంచి స్పీడు మీద వుండేమో- రోడ్డు ప్రక్కన వున్న ఒక చెట్టును పెకలించి, దాని క్రింద వుండిన టీ బంకును పూర్తిగా లేపేసి నెట్టుకుంటూ వెళ్లి, పదిగజాల దూరంలోని కార్పెంటరీ షెడ్డులోకి దూరి, గోడలు పగుల గొట్టు కుంటూ బయటకు వచ్చి, మరి రెండు బంకులను ఛిద్రం చేసి, వైర్లు దిగబడి పోవడంతో కరెంట్ స్తంభం దగ్గరగా ఆగి పోయింది. లారీ డ్రైవరు నిద్ర మత్తులో తూగడం వల్ల ఇంత బీభత్సం జరిగినట్లుంది. ఈ దుర్ఘటనలో, రోడ్డు ప్రక్కన మేత దిరుతుండిన ఒక ఆవు, దూడ నలిగి పోయాయి; ఆ సమయంలో పాల ప్యాకెట్ కోసం ఎదురు చూస్తూ నిలబడి వుండిన కచిరాయి(50) అనే వృద్ధ మహిళ వైర్ల క్రింద, టీబంకు తుక్కులో ఇరుక్కొని పది గజాల దూరం ఈడ్చబడి నుగ్గు నుగ్గు అయి పోయింది. టీ బంకు బయట బెంచీపై కూర్చుని వుండిన రామకృష్ణ(35) అనే నిప్పో లేబర్ కాంట్రాక్టర్ కూడా అక్కడిక్కడే మరణించాడు. మద్రాసు బస్ కోసం నిలబడి వుండిన బాలమ్మ(44) లలితమ్మ అనే మహిళలు గాయ పడ్డారు. టీ బంకు పైకి లారీ దూసుకొని వచ్చినప్పుడు, టీ కాస్తుండిన అన్సారీ(25) అనే యువకుడు ప్రక్కకు పడిపోవడంతో తప్పించు కున్నాడు. అయితే కాగే పాలు, డికాక్షన్ పైన పడి వళ్లంతా కమిలిపోయింది. కార్పెంటరీ షెడ్‌లో

కొరవ 7 పేజీలో



నిప్పో ఎదురుగా అంగళ్లు, ఇళ్లను బుల్ డోజర్ వల ధ్వంసం చేసిన లారీ భూతం; లారీ మధ్యలో ఇరుక్కొని పోయి వున్న రామకృష్ణ (రౌండ్ గుర్తు వున్న ప్రదేశం) క్రింద ఫోటో మరణించిన మరో వృద్ధురాలు.

## రాజీనామా

( మొదటి పేజీ కొరవ)

కలవాలని శ్రీమతి లక్ష్మిపార్వతి ఖండితంగా చెప్పేస్తారు. తను లేనిదే ఏ పార్టీ సమావేశానికి హాజరు కావడానికి ఎన్టీఆర్‌ను ఆమె వదలి పెట్టడం లేదు. ఆమె రాక ఆలస్యమైతే సమావేశాలు వాయిదా పడు తున్నాయి. ఎన్టీఆర్‌తో సహా నాయకు లందరూ ఆమె కోసం . నిరీక్షించ వలసి వస్తున్నది. అనారోగ్యం కారణం వల్లనో లేక మామగారు ఆమెను కాదని తమను బలపరచ రన్న నిజం ముందుగా గ్రహించడం వల్లనో చంద్రబాబు నాయుడు ఆమెతో సర్దుక పోయారు.

డాక్టర్ వెంకటేశ్వరరావు మాత్రం మరీ అంత దిగజార లేక పోయారు. ఆమెను రాజకీయాలలోకి తేవడం పట్ల అభ్యంతరం చెప్పడాన్ని ఆయన మాన లేదు. దీనిపై తరచు అత్త అల్లుళ్లకు పేచీలు వస్తుండేవి. ఈ నేపథ్యంలో పతను భార్య మురిపెం తీర్చను అల్లుళ్లను దూరంగా పెట్టక తప్పలేదు. జిల్లావారీ సమీక్షా సమావేశాలకు గాని, ఇతర ముఖ్యమైన సంప్రదింపులకు కాని అల్లుళ్లను పిలవడం మాని వేశారు. ఇతర నాయకుల వలె వారూ తీరికున్నప్పుడు ఎన్టీఆర్‌ను కలిసి పోవలసిందే తప్ప, అంతరంగిక చర్చలు, సమాలోచనల్లో పాల్గొనే అర్హత కోల్పోయారు.

పతిదేవుడి నైతే తొడపాశం పెట్టి అదుపులో పెట్ట గల్గింది కాని, రాష్ట్ర నాయకులను తన కాళ్ల దగ్గర కూలేయడంలో లక్ష్మిపార్వతి సఫలీకృతురాలు కాలేదు. పాత అలవాటు ప్రకారం వారందరూ ఎవరికి నచ్చిన అల్లుడి దగ్గర వారుగా గుమి కూడడం, వారిద్దరి ప్రభావం పార్టీపై నన్న గిల్లక పోవడం ఆమెకు కంటగింపుగా మారింది. ఎన్నికలు దగ్గర పడిన ఈ సమయంలో వారి తోకలు కత్తిరించ కుంటే పార్టీపై తనకు పూర్తి అదుపు రాదని ఆమె భావించి నట్టున్నారు. ఏ మంచి మూర్త్ కనిపెట్టి ఎన్టీఆర్‌కు అల్లుళ్లపై పితూరీలు చెప్ప గల్గిందో ఏమో తెలియదు గాని, కైక వరాలు తీర్చను ఉద్యుక్తుడైన దశరథుడి వలె ఆయన అల్లుళ్లను వారి వారి సైజులకు కత్తిరించ డానికి సన్నద్ధులైనారు. నేరుగా చెప్పను సంశయించి తన దగ్గరకు వచ్చే నాయకుల దగ్గర అల్లుళ్ల ప్రస్తావన తెచ్చి మీరెవరూ వారి దగ్గరకు వెళ్లడానికి, మాట్లాడడానికి లేదని హుకుం జారీ చేశాడు. క్షణాలలో ఆ వార్త ఇద్దరికీ చేరి పోయింది. చంద్రబాబు తన మనసును ఎప్పుడో చంపేసుకున్నాడు కాబట్టి చలించ లేదు. అత్తా, మామల పాద సేవ చేసుకునే భాగ్యం మిగిలినా చాలన్నట్లు సరిపెట్టుకున్నాడు. కాని వెంకటేశ్వర రావుకు అది అలివి కాలేదు. ఉగ్రుడై రాజీనామాకు సంకల్పించాడు. ఎందరెన్ని చెప్పినా విన్పించు కోలేదు. నేరుగా మామతోనే అమీతుమీ తేల్చుకోవాలని వెళ్లి పార్టీకి తాము చేసిన సేవ, తమకు ఎదురౌతున్న అవమానాల గురించి నిలదీశారు. ఇద్దరి మధ్య వాగ్వివాదం జరిగింది. చివరకు ఎన్టీఆర్ బ్రతిమ లాడడంతో రాజీనామాలు వెనక్కు తీసుకొని వచ్చేశారు. పార్టీలో తన తర్వాత మీరే ముఖ్యులు అన్న మాట ఆయన నోట అన్పించి మరీ వచ్చాడు వెంకటేశ్వర రావు.

ఈ సంఘటన తెలుగు దేశం పార్టీలో తీవ్ర అలజడి సృష్టించింది. అల్లుళ్లకే గతి లేకుంటే తమ దుర్గతి ఎట్లా వుంటుందోనని నాయకులందరూ హడలి చస్తున్నారు. అల్లుడు తిరుగుబాటు చేశాడన్న వార్త ప్రజలలో పార్టీ పట్ల ఎటువంటి ప్రభావం కల్గిస్తుందోనన్న భయమూ వారిలో వుంది.







### జిల్లా వార్తలు

(5 పేజీ కొరవ)

ఏకమవడమే గాక ప్రతిభ గల విద్యార్థులను ప్రోత్సహించడంలోనూ ముందున్నారు. ఇందు కోసం హై స్కూల్ ఆవరణంలో 27 తేది కాలేజి ప్రిన్సిపల్ కె.బి. జయకుమార్ అధ్యక్షతన ఒక అభినందన సభ ఏర్పాటు చేసారు. గత విద్యా సంవత్సరం పదవ తరగతిలో అత్యధిక మార్కులు సాధించిన విద్యార్థిని ముక్కు వాణికి, తాను డిపాజిట్ చేసిన 5 వేల రూపాయల పై వచ్చిన వడ్డీ 694 రూ చెక్కును శ్రీ సోమవరపు రమణారెడ్డి అందించారు. మరో రైతు కేతిరెడ్డి శంకర రెడ్డి మెమోరియల్ నగదు బహుమతి 565 రూపాయలను ఎన్. మురళీకృష్ణకు ప్రిన్సిపల్ కె.బి. జయకుమార్ బహూకరించారు. పూండ్ల కృష్ణారెడ్డి ప్రకటించిన బహుమతి దాసరి అమృత, పెళ్లూరు రామప్రసాద్ అందుకొన్నారు. పదవ తరగతిలో మంచి మార్కులు తెచ్చుకొన్న ఎం. హైమావతిని దేవళ్ల గోవింద రెడ్డి, డాక్టర్ బ్రహ్మారెడ్డి నిధి బహుమతులను ఎం.ఇ.ఓ. పి.పోలిరెడ్డి పంచారు. కార్యక్రమంలో హైస్కూల్ ప్రధానోపాధ్యాయులు ఎన్. వాసుదేవ రావు కూడా పాల్గొన్నారు. ఇటువంటి ప్రోత్సాహాల మూలంగా వలువురు వితవలూరు విద్యార్థులు నేడు ప్రపంచం నలు మూల వున్నత స్థానాల్లో వుండి వూరి పేరు నిలబెడుతున్నారు!

### మన్మోహన్‌సింగ్

(2 పేజీ కొరవ)

..దాయం వచ్చింది. కానీ పరిశ్రమ ..బ్బతిని పోయింది.

ఐఎంఎఫ్, వరల్డ్ బ్యాంక్

ఐఎంఎఫ్, వరల్డ్ బ్యాంక్ వంటి సంస్థలు ఆర్థిక మంత్రిని బలవంతం చేసి తెలివిగా పన్నుతున్న కుట్రలో భాగమే ఈ పరిస్థితి. ఇంత కంటే దారుణమైన విషయం ఫేస్ పౌడరు, లిప్‌స్టిక్‌ల వంటి సాధారణ వినియోగ వస్తువులను కూడా మనం దిగుమతి చేసుకోవలసి రావడం. ఆఖరకు హోటళ్లు, ఐస్‌క్రీం పార్లర్లనూ విదేశీ సంస్థల పరం చేస్తున్నారు. మధ్య తరగతి ప్రజానీకం మొత్తాన్ని పాశ్చాత్య వస్తువుల మాయలో ముంచెత్తి, స్వదేశీ వ్యాపార, పారిశ్రామిక సంస్థల పతనానికి పునాదులు వేస్తున్న బృహత్తర కుట్ర గురించి పై వారం తెలుసు కుందాం!

(ఎకనామిక్ టైమ్స్, ది వీక్ వంటి పత్రికల ఆధారంగా)

### నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ కొరవ)

నిద్రపోతుండిన వెంకటేశ్వర్లు అనే యువకుడు మాత్రం పాక మొత్తం తన పైన కూలినా, ప్రక్కనే లారీ దూసుక వెళ్లినా నిరపాయ కరంగా బయట పడ్డాడు. లారీ కరెంట్ స్తంభానికి ఢీకొని వుంటే ఇంకా పెద్ద ప్రమాదం జరిగివుండేది. డ్రైవరు, క్లీనరు లిద్దరూ పోలీసు స్టేషన్‌లో లొంగిపోయారు.

### నెల్లూరులో ప్రియ సిమెంట్ ఆఫీసు

సిమెంట్ రంగంలో స్వల్ప కాలంలోనే మంచి పరిశ్రమగా గుర్తింపు పొందిన ప్రియదర్శిని సిమెంట్ లిమిటెడ్ నెల్లూరు ఆచారి వీధిలో ఒక సేల్స్, సర్వీసు ఆఫీసు నెల కొల్పింది. నాణ్యతకు గుర్తు అనదగిన 43 గ్రేడ్, 53 గ్రేడ్ సిమెంట్ లను రాష్ట్రంలో మొదటగా ప్రవేశ పెట్టింది వీరే. గత సంవత్సరం 123కోట్ల విలువైన సిమెంట్ అమ్మకాలు చేశారు. 53 గ్రేడ్ సిమెంట్ వాడితే కనీసం 12 శాతం సిమెంట్ ఖర్చు కలిసి వస్తుందట. నెల్లూరీయుల సిమెంట్ అవసరాలు పూర్తిగా తీర్చగల్గడం కోసం ఈ కార్యాలయం ప్రారంభిస్తారు. శుభమస్తు!

ప్రియ సిమెంట్ - కలువుగోలు మనిషి. ఎదుటి వారిలోని మంచిని తప్ప మరేమీ చూడని సౌమ్యుడు. ఎవరి గురించీ ఎప్పుడో పొరపాటున కూడా చెడుగా మాట్లాడని సంస్కారి. నెల్లూరు వదలి హైదరాబాదు వాసిగా మారి రెండు దశాబ్దాలు గడచినా నెల్లూరంటే పడి చచ్చే అభిమానం కల్గిన శ్రీ నెల్లూరు రాధాకృష్ణారెడ్డి కుటుంబ పరిశ్రమ. నెల్లూరు మీద ఆయనకున్న అరవరాని అభిమానమే ఈ ఆఫీసు స్థాపనకు కారణం. లేకుంటే నెల్లూరు వంటి చిన్న పట్టణంలో అంత పెద్ద ఆఫీసుఅవసరం వుండదు.

### సినీ వ్యాన్ ప్రమాదంలో బాలిక దుర్మరణం

తినడమెట్లా అన్న ఆలోచన తప్ప రోడ్లు ప్రజల కోసం, నిధులు రోడ్ల బాగు కోసమన్న స్పృహ లేని నీచ దృక్పథం కల్గిన వారు మన అధికారులు . అందుకే వారికి మంత్రులను చూస్తే అంత వణుకు. మంత్రో, ముఖ్యమంత్రో వచ్చినప్పుడు అర్ధరాత్రి పూట ఎర్ర మట్టితో రోడ్లకు ఫేస్ పౌడరు అద్దే అధికారులను అదే రోడ్లలో చొక్కా పట్టుకొని నిలదీసే దమ్ము ప్రజల కెప్పుడు వస్తుందో?

### ఒంగోలు అడిషనలు జిల్లా జడ్జి వారి కోర్టులో

I.A. 260/93 in A.S. 44/90

1. గ్రంధి శంకర రావు
2. గ్రంధి సత్యనారాయణ-పిటీషనరు

1. చక్కా సుబ్బారాయుడు (died)
2. గ్రంధి వెంకట సుబ్బయ్య సన్స్
3. గ్రంధి రాధాకృష్ణయ్య
4. చక్కా వెంచురామయ్య
5. చక్కా సుబ్బారావు
6. చక్కా రంగనాధం
7. చక్కా శ్రీనివాసులు -రెస్పాండెంట్లు

ఈ అప్పీలులో చనిపోయిన చక్కా సుబ్బా రాయుడుకు 4 to 7 రెస్పాండెంట్లను వారసులుగా చేర్పించుటకు కోరుచూ పిటీషను దాఖలు చేయగా, 4,6,7 రెస్పాండెంట్లకు ప్రకటన ద్వారా నోటీసు నిమిత్తం 11.2.94 తేదికి వాయిదా వేశిరి. కనుక సదరు 4,6,7 రెస్పాండెంట్లు వాయిదా రోజు వుదయం 10.30 గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరై అభ్యంతరములు చెప్పని యడల, పిటీషను ఆమోదించ బడునని తెలుపడ మయినది.

ఒంగోలు 28.1.94 — **తోట రామమూర్తి** పిటీషనర్ల అడ్వకేటు

# రాధామాధవ రస తాండవం రమ్యమైన సాహితీ అనుభవం!

శాస్త్ర రిటైర్డ్ ప్రొఫెసర్ ముక్కుపల్లి పేరయ్య శాస్త్రి, రీడర్ డాక్టర్ కె.ఎన్.శర్మ ముఖ్య అతిథులుగా విచ్చేశారు. పాలకవర్గ అధ్యక్షుడు తూపిలి సుందరరామిరెడ్డి, ప్రిన్సిపల్ డాక్టర్ డి. గోపాల కృష్ణమూర్తి వేదిక నలంకరించారు. ప్రొఫెసర్ శాస్త్రి మాట్లాడుతూ మనదేశంలో సాంఖ్యక శాస్త్ర అభివృద్ధికి దేశ తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ముఖ్య కారకులన్నారు. పంచవర్ష ప్రణాళికలను ప్రారంభిస్తూ వాటి రత్నాంశ సేకరణకు గాను ప్రొఫెసర్ పి.సి.మహలలోబిన్‌ను సెంట్రల్ క్యాబినెట్‌కు సాంఖ్యక సలహాదారుగా నియమించారు. ప్రపంచంలోని సాంఖ్యక శాస్త్రజ్ఞులలో, 60శాతం మంది భారతీయులని, వారిలో 60 శాతం మంది ఆంధ్రులని వివరించారు.

## నెల్లూరు సంగతులు

(5 పేజీ కొరవ)

డాక్టర్ కె.వి.ఎన్.శర్మ వస్తువు యొక్క గుణము సరిలేనట్లయితే వినియోగదారుడు ఆ వస్తువును తిరస్కరిస్తాడని కానీ తయారుచేసిన ప్రతి వస్తువును పరీక్షించడం సాధ్యం కానందున శాంపిల్ సిద్ధాంతం ఉపయోగించి వస్తు గుణాన్ని నియంత్రణ పెట్టాలని చెప్పారు. కళాశాలలో ఈ సంవత్సరం ఎం.ఇ.ఎస్., ఎ.ఇ.ఎస్. గ్రూపులలో సాంఖ్యక శాస్త్రంలో ఎక్కువ మార్కులు తెచ్చుకొన్న ఎన్.జె.వి. మల్లిఖార్జునరావు, గాయత్రిలకు బహుమతులు అందజేశారు. ఫిజిక్స్ డిపార్టుమెంట్ రిటైర్డ్ లెక్చరర్ డాక్టర్ సి.వి.రాఘవన్ ఆ డిపార్టుమెంట్‌లో పనిచేసి చనిపోయిన రాఘవయ్య జ్ఞాపకార్థం 500 రూపాయలను సీనియర్ ఇంటర్ విద్యార్థి టి.హర్షవర్ధన్‌కు ఇచ్చారు. రెడ్‌క్రాస్ తరఫున జపాన్ వెళ్లి వచ్చిన జూనియర్ బై.పి.సి. విద్యార్థిని ఎం.సుప్రియను అభినందించి, చివరన వందనాలు - చెప్పారు ఆర్గనైజింగ్ సెక్రటరి శ్రీ ఎ.వేణునాథన్.

### 'రాధామాధవ రసతాండవం'

రాధామాధవ రసతాండవ కావ్య పఠన సభ సాహితీవేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన టౌన్‌హాల్ రీడింగ్ రూంలో 2 తేది రసరమ్యంగా జరిగింది. శ్రీ టి.వేదాంతాచారి కావ్య పఠనాన్ని శ్రద్ధగా విన్న గోపాలరెడ్డి గారు తరువాత తనదైన ధోరణిలో మాట్లాడారు. శివ తాండవం, శ్రీ కృష్ణతాండవ నృత్యం మనకు తెలుసు; రాధా మాధవ రస తాండవం వినడం కొత్త అనుభూతి కలిగిస్తున్నది. పరమశివుడు నటరాజైతే, శ్రీ కృష్ణుడు నటవరుడనే శివుడు ఢమరుకం వాయిస్తె శ్రీ కృష్ణుడు పిల్లనగ్రోవి మ్రోయించాడు. శివుడు ప్రళయ తాండవం చేస్తె, కృష్ణుడు ప్రణయ తాండవం చేశాడు. శివ కృష్ణులకు ఆ విధంగా అభేదం చెప్పవచ్చని రాధా మాధవ రస తాండవంలో కవి రమ్యంగా రచించారని ప్రశంసించారు. రచయిత శ్రీ వేదాంతాచారి మాట్లాడుతూ తాను పుట్టపర్తి నారాయణాచార్యుల గారి శివ తాండవం చదివి ఆ స్ఫూర్తితో కావ్య రచన చేశానని చెప్పారు. న్యాయవాది శ్రీ మాడభూషి సుందరాచారి రచయితను సభకు పరిచయం చేయగా శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, శ్రీ దుగ్గెట్టి రమణయ్య కావ్య వాశిపాలను ప్రస్తుతించారు. శ్రీ వేదాంతాచారి తనకు సమాజం బహూకరించిన 500 రూపాయలను తిరిగి వర్తమాన సమాజానికి సమర్పించి తన ఔదార్యాన్ని చాటారు. రామకృష్ణ ప్రార్థనతో ప్రారంభమైన సభకు సమాజం కార్యదర్శి బి.వి. నరసింహాలు తొలుత స్వాగతం చెప్పి చివరన వందనాలు సమర్పించారు. ఆ రోజు సభలో ఒక కొసమెరుపుంది. తెబ్బైయవ పడిలో పడిన సమాజం మాజీ అధ్యక్షులు న్యాయవాది శ్రీ మాడభూషి సుందరాచారిని ప్రస్తుత అధ్యక్షులు శ్రీ పి.వి. రమణారెడ్డి సన్మానించడమే గాక చక్కటి తేనీటి విందును ఏర్పాటు చేశారు.

### ప్రభుత్వ వైద్య శాలలకు అడ్వైజరీ కమిటీలు

ప్రభుత్వ వైద్యశాలల పని తీరును మెరుగు పర్చేందుకు అనధికారులతో కూడిన అడ్వైజరీ కమ్ డెవలప్ మెంట్ కమిటీలను ఏర్పాటు చేస్తూ ఉత్తర్వు వెలువడింది. జిల్లా ప్రధాన వైద్యశాలతోపాటు క్షయ, ప్రసూతి వైద్యశాలల కమిటీలకు జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు ఛైర్మన్‌గా వ్యవహరిస్తారు. హాస్పిటల్ సూపరింటెండెంట్లు డాక్టర్లు పి. దత్తాత్రేయ, ఎ.వై. ప్రసాద్, శ్రీమతి జి. సరోజిని కన్వీనర్లుగా బాధ్యతలు నిర్వర్తిస్తారు. అనధికారుల నుంచి ప్రభుత్వ ప్రధాన వైద్యశాలకు డాక్టర్ జి. జయచంద్ర, ఎం. మల్లిఖార్జున రావు, టి. సుకుమార్ రెడ్డి, డాక్టర్ కె. రాజమ్మ, కె. బాలసుబ్రహ్మణ్యం సలహా లందిస్తారు. క్షయ ఆసుపత్రిలో డాక్టర్ ఎ.వై. ప్రసాద్, డాక్టర్ జి. అశోక్, సులోమిన్, టి. కోదండరామి రెడ్డి, ఎ. రాజేశ్వరమ్మ, డాక్టర్ భరత్ కుమార్ రెడ్డి, ప్రసూతి వైద్యశాలలో డాక్టర్ వై. ఇందిరమ్మ, పి. శోభారాణి, ఆర్. క్రిష్ణవేణమ్మ, వి. శారదాదేవి, కె. లలితమ్మ సభ్యులయ్యారు. కమిటీలూ నియామకాలు బాగానే వుంటాయి. మూడు ఆసుపత్రులు గబ్బు పట్టి పోయి వున్నాయి. సలహా సంప్రతింపులు, అభివృద్ధి సంఘ సభ్యులు శ్రద్ధ వహిస్తె గుడ్డిలో మెల్లగా నైనా నడుస్తాయి.

### శ్రీ కృష్ణ యోగా మందిరం

ఆధ్యాత్మిక జీవుల ఆశలు పండేలా దర్గామిట్ట సుజాతమ్మ కాలనీలో శ్రీ కృష్ణ యోగా మందిరాన్ని శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి ఈ నెల 25 తేది ప్రారంభిస్తారు. శ్రీమతి రేబాల సుజాతమ్మ, సి.కె. సుభప్రద ఆధ్వర్యంలో శ్రీ గణపతి సచ్చిదానంద అవధూత దత్త పీఠం ట్రస్ట్ మందిరం నిర్మాణ, నిర్వహణ బాధ్యతలు చూస్తున్నది. ప్రారంభోత్సవాన్ని పురస్కరించుకొని 21 తేది నుండి 28 వరకు ప్రతిదినం శ్రీ చక్ర పూజలు, హోమాలు, భజనలు కూడా ఏర్పాటు చేస్తున్నట్టు నిర్వాహకులు తెలియ జేస్తున్నారు



### ప్రకటన

ఇందుమూలమున తెలియ చేయడ మేమనగా మా కక్షిదారుడు వరిగొండ కాపురస్తుడు అయిన కామిరెడ్డి దశరథ రామిరెడ్డి గారి కుమారుడు సురేంద్ర రెడ్డి లోగడ 26.9.71 తేదిన వరకవిపూడి గ్రామ కాపురస్తుడు యానాటి రాజారామి రెడ్డి గారి కుమారుడు వేణుగోపాలు రెడ్డి ద్వారా ఈ క్రింది షెడ్యూలు దాఖలా భూమిని కొనుగోలు చేసి, సదరు భూమిని ఈ దినం వరకు సర్వహక్కుల తోటి అనుభవించుకొను చున్నారు. సదరు భూమి తాలుక జరిగిన విక్రయ పత్రము కనుపించుట లేదు. మా కక్షిదారుడు ఏలాటి అడుమానములు గాని, ప్రొనోట్లు దాకీలు గాని చేయలేదు. సదరు ఒరిజనల్ పత్రం నకలుతో సొసైటీ వారికి అయకవు అప్పు దాఖలా చేయుచున్నారు. సదరు దాకీ తప్ప ఇతర ఏ దాకీలు అన్వర్తించవు. అట్టి దాకీలు వున్న యెడల ఈ ప్రకటన వెలువడిన 10 రోజుల లోగా వ్రాతమూలకముగా తెలియజేయడమైనది.

**ఆస్థి షెడ్యూల్లు**

నె.రి.డి. ఇలాకా ముత్తుకూరు స.రి.లో చేరిన పైనంపురం గ్రామ పంచాయితీ ఏరియాలోని పట్టా నెం. 71 రు లో స.నెం. 207/1లో, య 1.39 ట్లు, స. 217/1 రు లో య 9.32 ట్లు, స. 218/1 య 7.80 ట్లు, స.220 రు లో య 0.38 ట్లు, య 18.89 ట్లు లేక H 7.644.

ఆర్.వి. రామమూర్తి
అడ్వకేటు, బృందావనం, నెల్లూరు

## శివారెడ్డి పద్యాలు

**రిపబ్లిక్ డే**

ఇంది పెండియన్స్రు ఇది సుప్రభాతమ్ము
ఇండియాకు గొప్ప పండుగ ఇది
భారతీయుడా! నీకులహుజన్మసుకృతమ్ము
ఇంతకంటె భాగ్యమేది లేదు

పూలు పత్రి పెట్టి పూజియ్యి బాపూజి
పాద పద్మములకు ప్రణతులియ్యి
ఇందిరమ్మ మనకు ఇలవేల్పు నర్చియ్య
శాంతి దూత నెహ్రూ స్మరణ జెయ్యి

**పేదరికము**

పుట్టించిన భగవంతుడు
పెట్టక పోతాడ తిండి పేదరికము యీ
లట్టాల వల్లబోతద
వట్టి వట్టి భ్రమలు వద్దు వద్దు శ్రమలు!

కొందరు పేదాసాదా
కొందరు లక్షాధికార్లు కోటీశ్వరులు
కొందరు యిటు కొందరు అటు
గందర గోళమ్ము పెద్ద గారడి సృష్టి!

**తప్పు నాది గాదు**

ఇంత దంత జేసి ఏదిదో వ్రాస్తుంట
గోకుతుంట ప్రొద్దుపోక ప్రతిది
కవిని నేను వేరు కలమేరు, యీ తప్పు
నాటు పురము కవిది నాది గాదు!

**తప్పు వొప్పు**

తప్పుజేసితాను, తప్పించుకుంటాడు
కొల్లబెట్టి, తాను కోర్టుకెళ్లి
తప్పుజేయక తాను తప్పించుకోలేడు
పూర్ మాన్ ఎంత దారుణమ్ము!

**రేపామాపా**

కవిని రేపామాపా కడతేరి పోతాను
వుండి చేసేదేంది వుబలాటము
పల్లెటూరి కవిత పద్యాలు, గద్యాలు
యింక రావు ఎపుడేమోర్దా!

### కామర్స్‌లో పోటీ పరీక్ష

టౌన్‌లోని సుధా కామర్స్ కోచింగ్ సెంటర్ ప్రతి యేడు వలెనేఈ యేడు కూడా కామర్స్‌లో పోటీ పరీక్ష నిర్వహిస్తున్నది. జూనియర్, సీనియర్ ఇంటర్ విద్యార్థులు పోటీలో పాల్గొనేందుకు అర్హులు. విజేతలకు 500, 250 రూపాయలను బహుమతులుగా ఇస్తారు. ఆసక్తి గల వారు 15 తేదిలోగా జయభారత్ హాస్పిటల్ సమీపాన గల కోచింగ్ సెంటర్‌లో పేరు నమోదు చేసుకోవాల్సిందిగా డైరెక్టర్ పి. వెంకటేశ్వర్లు కోరుతున్నారు.

### రాహుల్ సాంకృత్యాయన్ జయంతి సభ 20న

బహు భాషా కోవిదుడు రాహుల్ సాంకృత్యాయన్ శత జయంతి సభ టౌన్‌హాల్‌లో 20 తేది జరుగుతుంది. డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి అధ్యక్షతన జరిగే ఈ సభకు ప్రఖ్యాత కళాకారులు శ్రీ సంజీవ్ దేవ్, హేతువాద సంఘాధ్యక్షులు శ్రీ రావిపూడి వెంకటాద్రి, యు. సి.పి.ఐ కేంద్ర కమిటీ సభ్యులు శ్రీ ఆర్, సుందరరావు విచ్చేస్తారని కార్యక్రమ నిర్వాహక కన్వీనర్ న్యాయవాది ఆర్ సత్యనారాయణ తెలియ జేస్తున్నారు.

### వెటరన్ పోటీల్లో పాల్గొనే వారికి సూచన

ఫిబ్రవరి 13 తేది వి.ఆర్.సి గ్రౌండ్‌లో జరుగ నున్న జిల్లా స్థాయి వెటరన్ పోటీల్లో పాల్గొనదలచిన 40 ఏళ్లు నిండిన పురుషులు, 35 ఏళ్లు నిండిన మహిళల నుండి ఎంట్రీలు కోరబడుతున్నాయి. పాల్గొనే ఉత్సాహం గలవారు తమ వివరాలను తెల్లకాగితం మీద వ్రాసి ఎన్. మోహన్ రెడ్డి,26/506, పోస్టల్ కాలనీ, నెల్లూరు-4 అనే అడ్రస్‌కు పంపితే అర్హులుగా నమోదవుతారట.

### స్టేట్ బ్యాంకు వుద్యోగుల సొసైటి కార్యవర్గం

నెల్లూరు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఎంప్లాయిస్ కో ఆపరేటివ్ సొసైటీ ఎన్నికలు 31 తేది జరిగాయి. అధ్యక్షుడిగా డి. ఓబులరాజు, ఉపాధ్యక్షుడిగా ఎన్. వెంకటరావు, కార్యదర్శిగా డి. రఘురామయ్య, సహకార దర్శిగా ఎం. వినోద్ , కార్యవర్గ సభ్యులుగా ఎం.వి రమణయ్య, సి. పి. నాగార్జున ఎన్నికయ్యారు.

### హార్డ్‌వేర్, శానిటరీ వేర్ సంఘ కార్యవర్గం

టౌన్‌లోని ఇనుము, హార్డ్‌వేర్ రంగాలు, శానిటరీ వేర్ వ్యాపారస్థులు 27 తేది బారకాసులోని సర్వోదయ కాన్వెంటులో సమావేశమై ఒక సంఘాన్ని స్థాపించు కొన్నారు. కన్వీనర్లుగా జి. రమణారెడ్డి, సాదు నారాయణరావు, కె. వెంకటేశ్వరరావు, ఆర్. వెంకటేశ్వర్లు, డి. హేమంత్ కుమార్ రెడ్డి, కె. ఆర్. టాగూర్‌లను తాత్కాలికంగా ఎన్నుకొన్నారు.

### పంచాంగము

**ఫిబ్రవరి తిథులు**

పుష్యబహుళ
తే 5 శని దశమి రా.గ. 11.30 వ
తే 6 ఆది ఏకాదశి రా.గ. 9.50 వ
తే 7 సోమ ద్వాదశి రా.గ. 8.35 వ
తే 8 మంగళ త్రయోదశిరా.గ. 7.40 వ
తే 9 బుధ చతుర్దశి రా.గ. 7.35 వ
తే 10గురు అమావాస్య రా.గ. 7.25 వ
మాఘ శుద్ధ
తే 11శుక్ర పాడ్యమి రా.గ. 7.40 వ

"కుత్తేకా బచ్చా, కొవ్వెక్కిన లుచ్ఛా"

# తెలుగు పాటలెంత నీచానికి దిగజారాయి?

మన సినీ కవులు బూతు కవిత్వాన్ని మించిన రీతిలో తిట్టు కవిత్వమూ రాయగలరని జంధ్యాల దర్శకత్వంలో తయారౌతున్న "ష - గప్ చిప్" చిత్రం ద్వారా నిరూపణ అయ్యింది. ఆ చిత్రంలో జొన్నవిత్తుల రచించిన తిట్ల దండకం ప్రేక్షకులను ఆకట్టుకునే రీతిలో ఎలా ఉందంటే-

"ఓసేయ్ ట్రాపి .. మహా పాపి .. కురూపి
నిన్ను చూడంగానే వచ్చు హై లెవల్ బిపి
ముండమోపి.. జిరాపి. నిన్ను తగ్గేస్త్ర
లోకానికి పిచ్చి పాపి
అంకమంతాలుదా - జంక బధిరాంధుడా!
వరమ పాపిష్టి నికృష్ట దుష్టాత్మురా
నీ నీచ రూపంబు చూడంగ పాపంబు
నీ కంఠ నాళంబు కత్తెను గొట్టంబు
నీ కళ్లలో కుళ్లు, నీ బుర్రలో బురద
నీ పల్కులే చెత్త, నీ జన్మ ఛీనీచి
నువ్వో దగుల్బాజీ, ఏబ్రాసి, చచ్రాసి,
సన్నాసివి
అశుద్ధ స్వరూపా, అబద్ధ ప్రలాపా
పింగు బోరింగైనా, పింజారిగా
కుత్రేక బచ్చా, కొవ్వెక్కిన లుచ్చా
పగిలెను నీ పుచ్చె, తీరెను నా కచ్చ
నీ చేతికి వచ్చు చిల్లి బొచ్చె నిక్కచ్చిగా
భ్రష్టాతి భ్రష్ట - పరాకాష్ట తెల్లావు
దుష్టత్వమందున్
మురనష్టంగా, భ్రాష్టరి, కుష్టు ముష్టది
అంగుష్టమం
వృద్ధక్షయరోగి ఉచ్చిష్టమా
త్రేయునేకి నురుగా, దాంట్లోని బురగా
గుడ్ల గూబా - పగుల్తుంది గూబా"

ఇలా సాగే దండకం ధర్మవరపు సుబ్రహ్మణ్యం మీద చిత్రీకరింప బడింది.

## సెక్స్ నటికి అరెస్ట్ వారెంట్!

"నాకు ఎందరో ఇచ్చిన చెక్కులు తిరిగొచ్చాయి. నేనేమైనా కేసు పెట్టానా? నేను ఒకరికిచ్చిన చెక్ తిరిగొచ్చినందుకు నా మీద కేసు పెడ్తారా?" అని సినీ నటి అభిలాష వాపోయింది. తమె స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తూ ప్రధాన పాత్ర ధరిస్తున్న "అదిరిడి అభిలాష" అనే తమిళ చిత్రంలో పాల్గొన్న ఎవరికో ఇచ్చిన పదివేల రూపాయల చెక్కు బోగస్‌దని, బ్యాంక్‌ను మోసగించిందన్న అభియోగంపై మద్రాసు సైదాపేట 18వ కోర్టులో ఒక కేసు దాఖలైంది. విచారణకు ఆమె హాజరు కానందున ఆమెకు కోర్టు అరెస్ట్ వారెంటు జారీ చేసింది. దాంతో ఆమె జనవరి 20 తేనంపేట పోలీస్ స్టేషన్‌లో హాజరవక తప్పింది కాదు. ఇంకా విచారణ జరుగుతోంది.

## హాస్య నటుడి సరసన నటించనన్న తారలు

బాబూమోహన్ హీరోగా "సుందర వదనా - సుబ్బలక్ష్మి మొగుడా" చిత్రానికి రేలంగి నరసింహారావు దర్శకత్వం వహిస్తున్న విషయం ప్రేక్షకులకు తెలిసిందే. ఐతే, ఈ చిత్రంలో బాబూమోహన్ సరసన నాయకలుగా నటించడానికి కొందరు యువతారలు అంగీకరించ లేదు. అంచేత శారదా ప్రీతి, కీర్తన అనే తమిళ తారలను బుక్ చేసుకోవలసి వచ్చింది. "రేపు ఈ చిత్రం సూపర్ హిట్ అయ్యాక నా పక్కన యాక్ట్ చేయనందుకు ఆ తారలే ఏడ్చి తీరుతారు" అంటున్నాడు బాబూమోహన్.

## నిష్క్రమిస్తున్న నటి

ముచ్చెర్ల అరుణ చెల్లెలు నందిని తెలుగు, తమిళ, కన్నడ

కొరవ 11 పేజీలో


భైరవద్వీపం గూర్చి రోజాను ఆరా తీస్తున్న బాలకృష్ణ

## కుర్రకారు రక్తపోటు పెంచే 'అనూ' అందాలపొంగులు

# దొంగ...దొంగలో వుండేవవే!

దర్శకుడు మణిరత్నం గతంలో తీసిన చిత్రాలతో పోల్చితే, తాజాగా తీసిన "దొంగ ... దొంగ" ఆ జాబితాలో చేరదు. బహుశా ఈ చిత్ర కథతో పోలిన క్షణక్షణం వంటి చిత్రాన్ని తెలుగు ప్రేక్షకులు చూసి వుండడం; దొంగ దొంగ చిత్రానికి కూడా ఆ చిత్రాన్ని తీసిన రామ్‌గోపాల్ వర్మనే కథ అందించడం అందుకు కారణం కావచ్చు. కథను తీసి పక్కన పెడితే సన్నివేశాల రూప కల్పన, కథన నడిపిన తీరు, అత్యద్భుత ఛాయాగ్రహణం, హృదయాన్ని తట్టి లేపే సంగీతపు ఝురిలో మణిరత్నం ముద్ర అచ్చు గుద్దినట్లు కనపడుతుంది. కాని అక్కడక్కడా గతంలో ఆయనే తీసిన ఘర్షణలోని లైటింగ్ టెక్నిక్, గీతాంజలిలోని వర్షపు జల్లుల మధ్య సాగే కొన్ని సన్నివేశాలు పునరావృతమైనా సామాన్య ప్రేక్షకులు పసిగట్టలేరు. సినిమాలోని ఇద్దరు దొంగలు చిన్న దొంగలైనా పెద్ద పెద్ద దొంగ తనాలు చేయడం; వాళ్లే అవి చేశారని తెలుస్తున్నా పోలీసులు వాళ్ల చుట్టూ తిరుగుతూనే పట్టుకోక పోవడం వాస్తవికతకు దూరంగా వుంది. అదే విధంగా గుర్రపు బండ్లు, లారీలు, బస్సులు గాల్లోకి ఎగిరిపోయి క్రింద పడ్డాక కూడా చెక్కు చెదరక వుండడం పై కోవలోనివే. బాలీవుడ్ సెక్స్ సింబల్, ఈ యేటి కండొమ్స్ మోడల్, ఆపికి అనూ అగర్వాల్‌తో వర్షంలో 'కొక్కొ విప్పేయనా' వంటి డైలాగులు పలికిస్తూనే వాటి కన్నా మిన్నగా ఆమెను చూపించిన తీరు కుర్రకారులో రక్తపోటు పెంచాయన్నది వాస్తవం. ప్రకృతిలో దాగిన అందాలను అబ్బుర పరిచేలా చూపిన కెమెరా పని తనానికి వెస్టరన్ ఆర్కెస్ట్రయిజేషన్ సంగీతానికి

**చిత్రసమీక్ష**
**అల్లూరు రహీం**

మణిరత్నం చేసిన పాత్రల రూపకల్పనను ప్రేక్షకులు నచ్చి తీరుతారు.

నాసిక్‌లోని సెక్యూరిటీ ప్రెస్ నుండి వెళ్తున్న వెయ్యి కోట్ల రూపాయల లాకర్ బైన్‌ను జి.టి. విక్రమ్ (సలీం గౌస్) ముఠా అశోక్ చెల్లయ్య నాయకత్వంలో కొల్లగొట్టి ఒక ప్రత్యేక కంటైనర్‌లో తీసుకెళ్లి పోతుంది. ఈ దోపిడీ దేశ వ్యాప్తంగా సంచలనం సృష్టించడంతో సి.బి.ఐ. ప్రత్యేకాధికారి లక్ష్మీనారాయణ (ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం) పర్యవేక్షణలో దర్యాప్తుకు దిగడం అశోక్ చెల్లయ్యను అరెస్ట్ చేయడం జరుగుతుంది. సి.బి.ఐ.కి దొరికి వందుకు చెల్లయ్యను బెయిల్ పై తీసుకొచ్చి హతమారుస్తాడు విక్రమ్. చెల్లయ్య కంటైనర్‌కు సంబంధించిన కంప్యూటర్ కోడ్ వివరాలను తన పుంపుడుగత్తె చంద్రలేఖ (అనూ అగార్వాల్) కు ముందే వ్రాసి వుంటాడు. సి.ఐ.బి.కి దొరికిన ఒక చిన్న ఆధారంతో అధికారులంతా చంద్రలేఖ అన్వేషణలో పడతారు. చిన్న దొంగ తనాలు చేసే చంటి (ప్రశాంత్) కిష్టయ్య (ఆనంద్), ఇంట్లో పెళ్లి తప్పించుకొను దొంగలతో లేచి వచ్చిన సీతాలు (హీరా), నాటకీయ ఫక్కీలో ట్రైన్‌లో చంద్రలేఖ సరసన చేరుతారు. అక్కడ నుంచి సి.బి.ఐ., జి.టి. విక్రమ్ బృందాలకు దొరుకుతూ, తప్పించు కొంటూ తిరిగి చివరికి వారందరూ కలిసి వెయ్యి కోట్ల కంటైనర్‌ను ప్రభుత్వానికి అప్పజెప్పడంతో చిత్రం పరిసమాప్త మవుతుంది.

సినిమాలో పాత్రలు తప్ప పాత్రధారులు కనపడరు. కాని ఈ ఎలివేషన్‌లో అనూ అగర్వాల్‌కు మినహాయింపు ఇవ్వాల్సిందే. అటు

కొరవ 11 పేజీలో

## ఉత్తరక్రియలు


జననం: 1904 మరణం: 28.01.1994

# శ్రీమతి చిల్లకూరు శేషమ్మ గారు

గూడూరు - 524 101.

28.01.1994 తేది శుక్రవారం తెల్లవారుజామున 1.00 గంటకు మద్రాసులో స్వర్గస్తులైనారు.

**7.2.1994 సోమవారం కర్మకృతువులు**

815, పూనమలై హై రోడ్, మద్రాసు - 600 010.

లోని మా స్వగృహామునందు జరుగును. కావున తెలుపడమైనది.

కుమారులు

సి. రమణా రెడ్డి
డా. సి.ఆర్. రెడ్డి
డా. సి. మోహన్ రెడ్డి
డా. సి.ఎల్.ఎన్. రెడ్డి
డా. సి. దయాకర్ రెడ్డి
సి. బాబు రెడ్డి
డా. సి.ఎమ్.కె. రెడ్డి

కావలి ప్రిన్సిపల్ డి.ము. కోర్టులో

O.S. No. 9 / 93

1. కాకర్ల మంజాన్
2. కాకర్ల బొరసానమ్మ

మైనర్లయినందున -వాదులు

Next Friend and Maternal Uncle

వింజమూరు రమణయ్య

కాకర్ల అయ్యన్న. S/o. మునలయ్య

వేములపాడ గ్రామం, జలదంకి మండలం

నెల్లూరు జిల్లా -ప్రతివాది

అనువారికి యీ నంబరున వాది మీ పై దావా [illegible]లు వేసుకొన్నందున దావా నోటీసు [illegible] 17.2.94 తేదికి వున్నది. కనుక యిందు విషయమై మీకు గల అక్షేపణలు ఆ రోజు పగలు 10 గంటలకు పై కోర్టులో హాజరై తెలుపు కోవలెను. లేని యెడల ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

వై. జానకి రామయ్య
సయ్యద్ కలీమ్ అహమ్మద్ రోజదార్
అడ్వకేట్లు, కావలి

In the Court of the Subordinate Judge, Nandyal

E.P. No. 108 / 93 Vs O.S. 6/85

State Bank of India,
Kurnool, - Decree Holder

Vs

M/s. Rayalaseema Steel Fastners (P) Ltd.,
Company represented by its Managing Director and 17 others
- Judgement debtors

పై నంబరు కేసులో Decree Holder లై తన అయకపు బాకీ రాబట్టుకొను నిమిత్తము తీర్పు ఋణగ్రస్తుల తాలుకు ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని పై కోర్టులో యాలమునకు తెచ్చినారు. 1.3.94 వ తేదిన యాలము వాయిదా వున్నది. యాలము రోజు అనగా పై తేదిన 10.30 గంటల నుండి సాయంత్రము 5 గంటల వరకు పై కోర్టులో హాజరై సవాలు పాడవచ్చును.

Schedule

Land Situate in Harivaram Village, Sub Registration District of Koila Kuntla, Registration District of Kurnool bearing the following description.

S.No. 219 Government Dry Land; Extent 19 Acres 38 cents Full

D.Hr Value Rs. 50,000/-

Amine Value Rs. 1,36,000/-

యాలము వాయిదా : 1.3.94

**Talanki Venkata Prasad**
Advocate for Decree Holder

## నెల్లూరీయుల ఆస్తులు

(4 పేజీ కొరవ)

వారి కంపెనీ సేవలలో పుట్టి పెరిగి వ్యాపారిగా, దుబాషీగా ఉన్నట్లు తెలుస్తుంది. ఈ రాయసం పాపయ్య మునుపటి పాపయ్య ఒకే వ్యక్తా కాదా అనేది తెలియదు. కాని, వీరిద్దరు నాయకత్వం వహించిన కులాలలో అధిక సంఖ్యాకులు నెల్లూరీయులు కావచ్చు. వృద్ధత్వంలో గూడ అంకన్న అనేక పదవులను నిర్వహించి కంపెనీ వారికి సేవలు చేశారు. ఇంతలో 1726 వ సం.లో అంకన్న చివరిగా గవర్నరుకు దుబాషీగా వున్నప్పుడు ధాన్యం కొలతలలో తప్పుడు లెక్కలు చూపాడన్న నేరం ఆయన మీద మోప బడింది. బహిరంగా వుండిన అంకన్న కుటుంబపు ఆస్తులలో దాదాపు సగ భాగం జల్మానాలు చెల్లించడంలోనే కరిగి పోగా ఆ తర్వాత కొద్ది కాలంలోనే అతడు చనిపోయాడు. ఆంగ్లేయ కంపెనీ వారిట్లా చేయడంలో కొన్ని అంశాలు విదితం. ధైర్య సాహసాలు, నేర్పరితనం, ధనం, పాండిత్యం గల్గిన స్థానికులను కంపెనీ వారు తమ పనులలో అతి చాక చక్యంగా ఉపయోగించు కొన్నారు. కాని కావలసిన గుణాలు వీరిలో తగ్గు ముఖం పట్టగానే ఏదో ఒక పన్నాగం పన్ని వీరిని వదలించు కొను చుండేవారు. నౌకర్లుగా నియమితులై వున్న వారి కంటె నధికులైన వారు ఆదే నౌకరీల నాశించి నపుడు ఆంగ్లేయాధి కారులు రెండు వర్గాల వారి నుంచి కొంత ధనాన్ని, కానుకలను సేకరించి తమ మాతృ దేశానికి కొని పోవు చుండిరి. ఆంగ్లేయుల పొగడ్తలకు పొంగి పోయిన నెల్లూరీయులు అటు దురదృష్టాలకు తరచుగా లోనౌతుండే వారు.

18 వ శతాబ్ది ప్రథమార్థంలో ఖ్యాతి గడించిన చెన్నపురి వర్తకులలో తంబుశెట్టి ఒకరు. ఆయన ధనికుడే గాక ప్రభుత్వపు పలుకుబడిని విరివిగా పొందిన వాడు. అప్పటి వరకు పదవిలో వున్న సుంకు రామశెట్టిని తొలగించి ఆంగ్ల ప్రభుత్వం 1731 సం.లో తంబుశెట్టిని కంపెనీ ప్రధాన వ్యాపారిగా నియమించింది. ఈయన చాలా భవనాలు, భూములు కల్గి వుండేవారు. చెన్నపురిలోని కూపము నది ఈశాన్య ముఖం నుంచి తూర్పు ముఖంగా తిరిగే మలుపులో తంబుశెట్టి కొక ఫల వృక్షాదుల తోట వుండేది. దాని పొడవు దాదాపు 804 గజాలు, వెడల్పు 500 గజాలకు పైన, దాదాపు 600 ఎకరాలకు పై చిలుకు విస్తీర్ణం కల్గినది. తంబుశెట్టి పలుకుబడి సన్నగిల్లడంతో మిగతా ఆస్తులలో పాటు తోటకు కూడా ముప్పు వాటిల్లింది. ఈ తోటలో కొన్ని భాగాలకు పట్టా, కొల్ల సరిగా లేవన్న నెపంతో కంపెనీ ప్రభుత్వం స్వాధీనం పరచు కొన్నది. తంబుశెట్టి దాతృత్వ చిహ్నంగా ప్రభుత్వం వారీ తోటలో కొంత కాలం తర్వాత అనేక వృత్తుల వారికి ముఖ్యంగా నేతపని, అద్దకాల వారికి నివాసాలు కల్పించారు. అదే ఇప్పటి చింతాద్రిపేట. వెన్నెల నారాయణ శెట్టి (నాయుడు) అనే ఒక వ్యాపారిని పిలిచి, ప్రభుత్వం ఆయనకు కొంత ధనాన్ని అప్పుగా ఇచ్చి నేత కళాకారులను, అద్దకాల వారిని, పొగు కళాకారులను చింతాద్రిపేటకు వచ్చేటట్లు ఆకర్షించ వలసిందిగా ప్రోత్సహించారు. తన స్వంత సొమ్ము ఖర్చు చేసి నారాయణ శెట్టి ఎన్నో దాన ధర్మాల నాచరించారు. చింతాద్రి పేటలో రెండు పెద్ద దేవాలయాలు నిర్మించి వివిధ కులాల వారి మధ్య సఖ్యత పెంపొందించారు. ఈయన వృద్ధుడై ఇక్కడే 1743 సం.లో పరమపదించిన తర్వాత కూడ ఈయన చేసిన ధర్మ కార్యాలు చింతాద్రి పేటలో స్థిరంగా నిలిచాయి.

ఆంగ్లేయ కంపెనీకి బహాళ సేవలందించిన వారిలో అగ్రగణ్యులైన బేరి సోదరులు పెద వెంకటాద్రి, చిన వెంకటాద్రి తిమ్మనలు కంపెనీ పెద్దల కెన్నో బహుమానాలు అందజేశారు. ఇప్పటి గిండీ పార్కు ప్రాంతాన్ని 1695 వ సం.లో బేరి చిన వెంకటాద్రి తన కానుకగా కంపెనీ వారి కర్పించాడు. ఇట్లా దానాలిచ్చే భూములకా కాలంలో ఆర్కాటు నవాబు గారి ఫర్మానాలు పొందితేనే చెల్లుబడి. ఆ ప్రకారం 1708 వ సం.లో నవాబైన దావూదు ఖాను ఈ కానుక చెల్లదని అభ్యంతరం పెట్టినట్లు తెలుస్తుంది. కంపెనీ వారికి వెంకటాద్రి కుటుంబం వారిచ్చిన సలహా మేరకు వారు వెంటనే నవాబు గారిని దాదాపు 400 సీసాల పాశ్చాత్య సారాయితో సంతోష పెట్టి తమకు కావలసిన వాటిలో చాలా ఆస్తిపాస్తులకు ఫర్మానాలు పొందారు. గిండీ పార్కు కాకుండా, ఆ చుట్టు ప్రక్కల భూములకు, ఐదు గ్రామాదులతో కలిపి పంచగ్రామ ఫర్మానాను పొందారు. మిక్కిలి ప్రసన్నుడైన నవాబు తనకు సొంతమైన మౌంట్ రోడ్ ప్రక్కనే ఉన్న దాదాపు 40 ఎకరాల స్థలాన్ని కంపెనీ వారికి సమర్పించాడు. నవాబు గారితో మంతనాలు జరిపిన వారిలో సుంకు రామశెట్టి ప్రముఖుడు. ఇట్లా అనేక సందర్భాలలో ప్రభుత్వ పరమైన భవనాలు, తోటలు, తోపులు, భూములు మొదలైన వాటిలోను, కంపెనీ ఉద్యోగులకు స్థానికులందించిన నగదు, ఆభరణాలు మొదలు వాటిలోనూ నెల్లూరీయుల వాటాలు కానీ, వారి వారి పాత్రలు కాని స్పష్టంగా చెప్పుట సాధ్యం కాదు.

ఇంకా వుంది.

## జనవాణి

(3 పేజీ కొరవ)

విభజనలను తెచ్చి మరింత ప్రమాదకర పరిస్థితులను తెచ్చేట్లుంది. అన్ని కులాల వారిలోనూ ప్రగతి శీల భావాలు గలవారు చాలా మంది వున్నారు. అభివృద్ధి పేర బి.సిలనీ, ఎస్.టి. ఎస్.సిలనీ తెగ ప్రాకులాడుతున్న నాయకుల మనో ఫలకాల పై మెదులుతున్నది అధికార పీఠలాలసతే తప్ప ప్రజల బాగు కాదు సమైక్యత గల జాతి ఖండ ఖండాలు కాక మునుపే ప్రగతి శీల భావాలు గల యువకులతో కూడిన కొత్త పార్టీ ముందు కొచ్చి రాబోతున్న ఉపద్రవానికి అడ్డు కట్ట వేయాలి. లేకుంటే చూత ముచ్చటైన భారత దేశ పటాన్ని అదే విధంగా ఆంబెన్నాళ్లో చూడము.

బి. వెంకట సుబ్బయ్య
కోవూరు

### శాఖా చంక్రమణం

రసిక్ రాసిన పరమాచార్యకు శ్రద్ధాంజలి చదివి సతమస్తకుడైనాను. మీరు పేర్కొన్నట్లు ఆయన నడిచే దైవం. కరుణా సముద్రుడు కూడా. 1968 నవంబరు నెలలో వెంకటగిరి దగ్గర కుగ్రామమైన పోతేగుంటలో గల శివాలయ పునరుద్ధరణకు వెళ్తూ అర్థరాత్రి ప్రాంతంలో రాపూరు హై స్కూలులో 3 - 4 గంటలు మకాం చేశారు. ఆయన పల్లకి మోసే బోయీలు మామూలు వేళ ప్రకారం 4 గంటలకు లేవారు కానీ ఆయన లేరు. బోయీలకు శ్రమ తగ్గించను, ఎవరినీ లేపకుండా ఒంటరిగా మర్లపూడి చేరుకొన్న నిగర్వి ఆయన. నడిచి వస్తున్న స్వామిని అనుసరించిన భక్తులతో పాటు మర్లపూడి గ్రామస్థులకు ఆ గ్రామ చరిత్రను, భౌగోళిక పరిస్థితులను తేట తెనుగులో తెలియ చేయడాన్ని విని నేను ఆశ్చర్య పోయాను. పాదాభి వందనాన్ని వద్దని నీతి మస్తకులుగా మెలగమన్నారాయన.

పత్రికలో ప్రొఫెసరు అచ్చిరెడ్డి గారు రాస్తున్న వ్యాసం విజ్ఞాన దాయకంగా వుంది. కూపం నదికి వుత్తరాన గల భాగమైనా తెలుగు వారికి వదలమని ప్రకాశం గారు నెరపిన పోరాటం ఎంత వాస్తవికతతో కూడిందో జ్ఞప్తికి తెస్తున్నది ఈ వ్యాసం.

-దోర్నాదుల లక్ష్మీనరసింహం
రాపూరు

### సత్యాలను వెలికి తీస్తున్న వ్యాసం!

ప్రొఫెసర్ అచ్చిరెడ్డి గారు 'జమీన్‌రైతు' పాఠకుల కందిస్తున్న 'చెన్నపురిలో నెల్లూరీయత' చారిత్రాత్మక పరిశోధనా వ్యాసంలో చరిత్రలో అణగారిన సత్యాలను వెలికి తెస్తున్నది. దీన్ని చదువుతుంటే నాలుగు శతాబ్దాలు ముందు నాటి పరిస్థితులు కనుల ముందు సాక్షాత్కరించి నట్లున్నాయి. ముఖ్యంగా తుమ్మగుంట ద్రావిడ బ్రాహ్మణ శ్రేష్ఠులైన శ్రీ అవధానం పాపయ్య గూర్చి చాలా వివరాలు తెలిపారు. గుర్రం పై పర్యటనలు జరుపుతూ గుర్రం అప్పన్నగా పేరు గాంచిన వ్యలాషికి సంబంధించిన పలు గ్రంథాలు నెల్లూరులోని ఒక ప్రముఖ చరిత్ర పరిశోధకుని వద్ద వున్నాయి. వారి వారసులు కూడా నేడు నెల్లూరులో వున్నారు. పరిశోధకులు నేటికి చెన్నపురిలో ప్రముఖులుగా వెలుగొందుతున్న నెల్లూరీయుల వివరాలను కూడా ముందు వ్యాసాలలో పొందు పరచాలని మనవి.

నెల్లూరు -బి. పట్టాభి రామయ్య

### బి.జె.పి. మతతత్వం బి.ఎస్.పి. కులతత్వం

మరాఠ్వాడా విశ్వ విద్యాలయం పేరు మార్పుకు నిరసనగా శివసేన సాగిస్తున్న దౌర్జన్య కాండను ఖండిస్తూ మీరు వ్రాసిన సంపాదకీయం ఏక పక్షంగా వుంది. హరిజన, గిరిజన వర్గాలలో కాన్షిరామ్ ప్రాబల్యాన్ని నిరోధించ డానికి, దశాబ్దాల నాటి మరాఠ్వాడా సమస్యను తిరగ దోడి రాజకీయ ప్రయోజనాన్ని పొంద డానికి ప్రయత్నించిన శరద్ పవార్‌ను ఖండించడానికి ప్రయత్నించక పోవడం విచారకరం. ఒక విశ్వవిద్యాలయానికి మాననీయ అంబేద్కర్ పేరు పెట్టినంత మాత్రాన అగ్రవర్ణాలకు వాటిల్లే నష్టమేమీ లేదు. అదే విధంగా పీడిత వర్గాలకు ఒక గూడే ప్రయోజనం కూడా శూన్యం. అంబేద్కర్ కోరుకున్నది కులమతాల కతీతమైన సమాజం గానీ, రిజర్వేషన్లు, విగ్రహ ప్రతిష్టాపనలు, ప్రభుత్వాల ప్రచారార్భాటాలు కాదు. దళిత జన సముద్ధరణకు ప్రయత్నించిన వారిలో అగ్రవర్ణాల ప్రజలే నిర్మాణాత్మక పాత్ర వహించడం అవాస్తవం కాదు. విదేశి క్రైస్తవ ,మిషనరీల నిధుల కాశపడి మతం మార్చుకున్న హరిజనులు దళితులెట్లా కాగలరు? క్రైస్తవులుగా వుంటూ హరిజనులన్న పేరుతో వున్నతోద్యోగాలు చేసే వారు పీడిత వర్గాలు ఎట్లా అవుతారు? బి.జె.పి. మతతత్వం దేశ సమైక్యతకు ఎంత హానికరమో, కాన్షిరాం కులతత్వం అంతే ప్రమాదకరం. హైందవ సమాజంలో చైతన్యం పేరుతో బి.జె.పి. మతతత్వాన్ని ప్రోత్సహిస్తే, దళిత వర్గాలలో చైతన్యం అంటూ బి.ఎస్.పి. కుల, వర్గ తత్వాలను ప్రోత్సహిస్తున్నది.

పి.వి.ఎల్. మాధవరావు
నెల్లూరు

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### నెల్లూరు ముచ్చట్లు

#### బుచ్చి ప్రెసిడెంటుకు

బుచ్చి రెడ్డిపాలెం పంచాయతీబోర్డు ప్రెసిడెంటు శ్రీ దొడ్ల పెదబ్బయ్యరెడ్డి గారి పరిపాలనకు మూర్ఛబోయి "విన్నెందుకు తీసివెయ్యకూడదో కారణం చెప్పు" మని ప్రభుత్వం నోటీసు యిచ్చిందట. సరే! గూడూరు ప్రెసిడెంటు "నేను యుద్ధకార్యాల్లో నిమగ్నుడనై యుండి బోర్డుకార్యాలు చూడలే"దంటె భేష్ అని మన్నించారు. మన పెదబ్బయ్య రెడ్డో! "నేను అరటితోట పనుల్లో తీరిక లేక అపకతవకలు చేశాను" అంటాడేమో?

ఇంతకూ ఆ మహానుభావుడు శ్రీ రామచంద్ర మూర్తి సహాయమున్నప్పుడు యీలాంటి తుక్కు నోటీసు లేపిచేస్తవి లేండి.

### ఇది చావో మరణమో?

జనవరి 29 వ తేదిన యీదూరులో మూడు చిమ్మిరి ముద్దలు, ఒక అరటి, రావి రామమ్మ యింటి ముందర పడవేసి వుండగా, రామమ్మ ఒక ముద్ద, తల్లి ఒక ముద్ద తిన్నారట. కొడుకు తినబోతే ముద్ద క్రింద పడ్డది. రామమ్మకు, తల్లికి భేదులు, వాంతులు! మధ్యాహ్నానికి రామమ్మ చెల్లుకున్నది.

ఇది సాధారణ చావో? విషప్రయోగ మరణమో? అని వూరంతాగోల. తల్లికి మాత్రం చికిత్స జరిగింది. నెమ్మదిగానే వుంది. ఇది చావో? మరణమో?

## అందమైన పూలు

(4 పేజీ కొరవ)

చేయటంలో ఇజ్రాయిల్ 11 శాతం మార్కెటును సంపాదించగా, కొలంబియా 5.3 శాతం, థాయ్‌లాండు 2.7శాతం, కెన్యా 1.3 శాతం మార్కెటును సంపాదించాయి.

ఆర్కిడు పూలను థాయ్‌ల్యాండు, శ్రీలంక, సింగపూరు దేశాలు ; గులాబి, కార్నేషను, గ్లాడియోలసు పూలను కెన్యా; గులాబి, చేమంతి, కార్నేషను పూలను కొలంబియా, బ్రెజిలు దేశాలు; గులాబి, ఫ్లోరిడియా, గ్లాడియోలసను దక్షిణ ఆఫ్రికా దేశాలు ప్రముఖంగా ఎగుమతి చేస్తున్నాయి.

### భారత దేశం నుంచి పూల ఎగుమతి

1969 లో భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థ, కొత్త ఢిల్లీ, ఎస్.టి.సి. తో కలసి, ప్యారిస్, రాటర్ డ్యాము, ఫ్రాంకు ఫర్డులకు, గులాబీలను ఎగుమతి చేయడం ద్వారా పూల ఉత్పత్తుల ఎగుమతులకు శ్రీకారం చుట్టబడింది.

దురదృష్ట వశాత్తు గత 20 సంవత్సరాలలో పూల ఎగుమతి గణనీయమైన అభివృద్ధి చెందలేదు. మనకు వివిధ రకాల వాతావరణ పరిస్థితులు, సలీసుగా దొరికే కూలీలు, అభివృద్ధి చెందిన సాంకేతిక పరిజ్ఞానం ఉన్ననూ పూల ఎగుమతి అనుకున్నంతగా లేకపోవడం నిజంగా దురదృష్టం. పూలు ముఖ్యంగా, జర్మనీ, హాలండు, ఇటలీ, అమెరికా దేశాలకు, అందాన్నిచ్చే ఆకులు కలిగిన మొక్కలను ఓమన్, అరేబియా దేశాలకు ఎగుమతి చేస్తున్నారు.

పూల ఎగుమతులకు ప్రోత్సాహాన్నిచ్చేందుకు భారత ప్రభుత్వం వివిధ సంస్థల ద్వారా సహకారాన్నిస్తుంది.

హైదరాబాదు, చుట్టు పక్కల పూలను సాగుచేసి ఎగుమతి చేసేందుకు ఒక హైటెక్ సంస్థ ఇటీవల హైదరాబాదులో మొదలైంది. ఐతే పూల ఎగుమతి ద్వారా పురోగతి సాధించేందుకు కొన్ని ఆటంకాలు మన రైతులు, వ్యాపారస్తులు ఎదుర్కొంటున్నారు.

ఉదాహరణకు ఉత్పత్తిలోగాని, క్వాలిటీలో గాని మనపూలు నాసిరకంగా ఉంటున్నాయి. కొత్తగా పూల తోటలు పెంచేందుకు కావలసిన నారు మొక్కలు, అంటుమొక్కలు లభ్యం కావటం లేదు. ఇంతెందుకు 1 ఎకరా కనకాంబరం వేసుకొని స్థానిక మార్కెట్లో అమ్ముకున్నామనుకున్నా, దానికి కావలసిన విత్తనం గాని, నారుగాని నెల్లూరులో దొరకదు. ఎగుమతి చేసేందుకు విధించే సుంకం ఎక్కువగా ఉంది. మార్కెటు సౌకర్యాలు అర్థనైజాదుగా లేవు.

అంతేగాక వాణిజ్య పరంగా పూల మొక్కల సాగు మనం ఇప్పుడిప్పుడే మొదలు పెట్టినాం. మన వ్యవసాయ విశ్వ విద్యాలయాల్లో, ఇతర పరిశోధనా సంస్థల్లో ఉన్న స్వల్ప సౌకర్యాల వల్ల ఎగుమతులకు అనువైన పూల మొక్కల రకాలను సృష్టించడంలో ఆలస్యం జరుగుతుంది.

ఐతే, ఇప్పుడిప్పుడే ప్రైవేటు వ్యక్తులు, సంస్థలు, పూలను ఎగుమతి చేసేందుకు ముందుకు వస్తున్నారు.

అంతర్జాతీయ మార్కెటులో మంచి నాణ్యత గల పూలనే అంగీకరిస్తారు. నెదర్‌ల్యాండ్సులో ఉన్న 'ఆల్‌సమీర్' వంటి పెద్ద వేలం మార్కెటులో ఐతే నాసి రకం పూలను అంగీకరించక పోవడమే గాక, వాటిని ఇక ఎక్కడా అమ్మకుండా వెంటనే నాశనం చేసి వేస్తారు.

సాధారణంగా మన దేశంలో సాగుచేయబడే పూలు అంతర్జాతీయ పరిమాణాలకు చేరువలో ఉండవు.

ఐతే అద్దాల ఇళ్ళలో పెంచబడే గులాబీలు మాత్రం యూరోపెన్ మార్కెటులో మంచి డిమాండు కలిగి ఉన్నాయి.

అంతేగాక కోసిన పూలకు, పూల మొక్కలకు కావలసిన ప్యాకింగు ఒక్కో రకానికి ఒక్కో విధంగా ఉంటుంది. ఆ సౌకర్యం మనకు పూర్తిగా అందుబాటులో లేదు. ప్యాకింగు పద్ధతులు సులభమైనవిగా, సలీసుగా ఉంటూ, ఆకర్షణీయత కలిగి అంతర్జాతీయ మార్కెటుకు అనుగుణంగా ఉండాలి.

కోసిన పూలు, పూల మొక్కలు త్వరగా చెడిపోతాయి కనుక నేరుగా వెళ్ళే విమానం ద్వారా గమ్యస్థానం చేరాలి. అంతేగాక పూలను కొద్ది విస్తీర్ణంలో మాత్రమే ఒక్కో రైతు సాగు చేయగలడు. దిగుమతి చేసుకునే దేశాలు ఎక్కువ మొత్తంలో పూలను అడుగుతాయి కనుక రైతులు విడి, విడిగా వారి పూలను ఎగుమతి చేసుకోలేరు. అందువల్ల చిన్న రైతుల దగ్గర నుంచి వారి పూలను సేకరించి ఎగుమతి చేసేందుకు రైతు సంఘాలు గాని, ఎగుమతి సంస్థ గాని కావాలి. ఉదాహరణకు బ్యాంకాక్ దేశంలో ఆర్కిడు పూలను ఎగుమతి చేసేందుకు 500 మంది గల సంఘాలను ఏర్పాటు చేయడం జరిగింది. సంఘంలో గల ఒక్కో రైతు 2-4 హెక్టారుల తోట కలిగి ఉండి, వారి పూలను ప్రతి ఉదయం సహకార సంస్థకు చేరుస్తారు. అక్కడ ఆర్కిడు పూలను వేరు చేసి, గ్రేడింగు ప్రకారం ప్యాకు చేసి ఎగుమతి చేస్తారు.

మనం గూడ, ఇంత డిమాండు గల గులాబీలను, ఆర్కిడులను, చేమంతులను నేరుగా తోటలో గాకుండా, గ్లాసుఇళ్ళలోనో ప్లాస్టిక్ ఇళ్ళలోనో, నియంత్రించ బడ్డ వాతావరణ పరిస్థితుల్లో పండించి, ఎగుమతి చేసి లాభం పొందవచ్చు. గ్లాసు ఇళ్ళ నిర్మాణం, వాటిలో ఉన్న కష్టనష్టాలను, ఇంకోసారి పరిశీలిద్దాం.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

తమిళ మాతృక "తిరుడా ... తిరుడా" ఇటు తెలుగు "దొంగ ... దొంగ " తెర పై తొలి పరిచయం కావడమే కారణం. కెమరామెన్ పి.సి. శ్రీరాం లైటింగ్ విన్యాసం అనుపమ హస్కీ వాయిస్ "కొంచెం నరకం ... కొంచెం స్వర్గం వున్నాయి నా కళ్లలోనా" పాటలో అనూ కసి చూపులు వంటి విరుపులు, కాస్ట్యూమ్స్‌ను ప్రేక్షకులు అబ్బుర పడుతూ చూస్తారు. కొత్త బంగారు లోకం పాటలో పకృతి ఒడిలో దాగిన కొండలు, కోనలు, సెలయేర్లు పచ్చిక బయిళ్ల అందాలను పి.సి. శ్రీరామ్ కెమరా మరో సారి బట్ట బయలు చేస్తుంది. తీతీయని సెగలు నాకు అందం పాటలో సౌండ్ డామినేషన్ వెర్రెక్కిస్తుంది. గ్రామీణ ప్రాంతాల అందాలకు "కనులు కనులు దోచాయంటే ప్రేమ అని దానర్థం" పాటలో దర్పణ మవుతుంది. ప్రతి పాట చిత్రీకరణలోనూ మణిరత్నం శ్రద్ధ, ట్రీట్ మెంట్ కనపడుతాయి. రోజా, జెంటిల్‌మేన్‌కు సంగీతాన్నిచ్చిన రెహమాన్ ఈ చిత్రంలో సాహిత విలువలు ఏ మాత్రం చెవులకు సోక కూడదని కాబోలు ఆర్కెష్ట్రా చాటున దాగేలా చేసినా, కొత్త గాయకుల స్వరాలు సమ్మోహనాలే. మాస్టర్ జి.వి. ప్రకాష్ చేత "చికు ... బుకు రైలే " స్టైల్‌లో దొంగ ... దొంగ అని చెప్పించే ప్రయోగమూ అటువంటిదే. ఎడిటర్ సురేష్ ఆర్స్ పనితనం ప్రతి ఫ్రేములో కనపడుతుంది. హృదయం చిత్రంలో యువ హృదయాలను గిలిగంతలు పెట్టిన హీరా 'సీతాలు' గ్రామీణ పాత్రధారిగా ఒప్పించలేక పోయింది. చిత్రంలో ఒక్క పాట పాడకపోయినా సి.బి.ఐ. ఆఫీసర్‌గా ఎస్పి బాలసుబ్రహ్మణ్యం చక్కగా నటించాడు. ప్రశాంత్, ఆనంద్ పాటలు, ఫైట్లలో సమవుజ్జీలని పించారు. సలీం గౌస్‌ను వర్మ మణిరత్నానికి అంట గట్టినట్లుంది. అనూ అగర్వాల్ ముఖ వర్చస్సు కన్నా వంపు సొంపుల పైనే ప్రేక్షకుడు కళ్లు నిలుపుతాడు. డబ్బింగ్ చిత్రమైనా పాటల్లో, మాటల్లోస్థాయి తగ్గనీయని రచన రాజశ్రీ చేశాడు. పి.సి. శ్రీరాం, రెహమాన్ ప్రతిభకు పదును పెట్టి, మణిరత్నమే తీయగల సన్నివేశాలను చూడగలగాలంటే ఒకసారి ఈ చిత్రాన్ని చూడవచ్చండి!

## సినిమా

(9 పేజీ కొరవ)

చిత్రాలు కొన్నింటిలో మాత్రమే నటించింది. ఇంతలోనే ఈమెకు వైరాగ్యం పుట్టుకొచ్చింది. "సార్! నేనొక నిర్ణయానికి వచ్చాను. అంతే, ఇక నేను సినిమాలకు తిలోదకాలిచ్చేశాను. ఎందుకంటారా! చెమటోడ్చి నటిస్తే తగ్గ ఫలితం ఉండదం లేదు. సరిగా పారితోషికాలు చెల్లించరు. ఇప్పుడు ఫిలిమ్ ఫీల్డు బాగా పాడైపోయింది సార్. హాయిగా ఏ కంప్యూటర్ కోర్సో స్టడి చేస్తె నెలకింతని ఖచ్చితంగా జీతం అందుతుంది. అందుకే తిరుగు లేని నిర్ణయాన్ని తీసుకున్నాను" అంది. ఆమె అక్క ముచ్చెర్ల అరుణ ఎదుట

ఈ ప్రస్తావన తీసుకొస్తే, "మా చెల్లెలు భలే తెలివైనది. అందుకే అలా చెప్పింది. అసలు విషయం ఏమిటంటే అది త్వరలోనే ఇల్లాలు కాబోతుంది. మేము ఓ వంక వరుడిని అన్వేషిస్తూండగా మరో వంక ఆమే తన కాబోయే భర్తను ఎంపిక చేసేసింది. వరుడు పారిశ్రామికవేత్త. మిగతా వివరాలు శుభలేఖ ద్వారా త్వరలో మీకె తెలుస్తాయి" అంది అరుణ.

### గవర్నర్ విందులో పాల్గొన్న బేబీ శామిలి

"ఇటీవల తమిళనాడు గవర్నర్ చెన్నారెడ్డి గారితో మాట్లాడాను తెలుసాండి" అంటూ బేబీ శామిలి ముద్దు ముద్దు మాటలతో ఇలా చెప్పసాగింది: "న్యూ ఇయర్ ముందు రోజు - అంటే, డిసెంబర్ 31న మాకు గవర్నర్‌గారి భవనం నుంచి ఫోన్ వచ్చింది. రాజ్‌భవన్‌కు మమ్మల్నందర్నీ ఆహ్వానిస్తూ గవర్నర్ పి.ఎ. గారి పిలుపు. లంచ్ కూడా అక్కడేనన్నారు. ఇక మా ఆనందం ఏమని చెప్పను! మర్నాడు టంచన్‌గా ఒంటి గంటకల్లా నేను, అక్క శాలిని, అన్నయ్య రిచర్డ్స్, అమ్మ రాజ్‌భవన్‌కు చేరుకున్నాం. మాకు ఘనస్వాగతం.. తర్వాత వండర్‌ఫుల్ డిన్నర్. చికెన్, ఫిష్, ఐస్‌క్రీమ్.. గవర్నర్ గారు నాతో ఇంగ్లీషులోనే మాట్లాడారు. "నీకు తెలుగొచ్చా? అని అడిగారు. "కొంచెం కొంచెం..."అన్నాను. ఆయన నవ్వుతూ నా భుజం తట్టారు. నా సినిమాలు, మా అక్కయ్య సినిమాలు ఆయన బోలెదు చూశారట. తర్వాత నేను, అక్కయ్య ఏ ఏ క్లాసులు చదువుతున్నాం, ఏ స్కూల్లో అన్న విషయాలు తెలుసుకున్నారు మేం అక్కడ్నుంచి సెలవు తీసుకునే ముందు మాకు రాజ్‌భవన్ అంతా చూపించారు. ఎంత వండర్‌ఫుల్‌గా ఉందో!".

### మరో హాస్యనటుడు హీరోగా చిత్రం

బాబూమోహన్, బ్రహ్మానందంల అనంతరం కథానాయకుడు అవబోతున్న హాస్యనటుడు అలీ. రాజమండ్రికి చెందిన ఈ యువకుడు చక్కని మిమిక్రీ ఆర్టిస్ట్. చాలా చిత్రాల్లో చిన్న చిన్న పాత్రలు ధరించిన ఇతనికి "యమ స్పీడ్" అనే చిత్రం ద్వారా ఈ ప్రమోషన్ లభించింది. ఇతని సరసన ఒక కొత్త నటి పరిచయం గావింప బడుతుంది. చాలా కాలం తర్వాత మంజుభార్గవి నటించే ఈ హాస్య చిత్రంలో యముడుగా సత్యనారాయణ, చిత్రగుప్తుడుగా బ్రహ్మానందం, ఇతర పాత్రలలో కోట శ్రీనివాసరావు, సాక్షి రంగారావు, తనికెళ్ల భరణి, గుండు హనుమంతరావు, శ్రీలత పాత్రధారులు. కథ, స్క్రీన్ ప్లే, సంగీతం, దర్శకత్వం: ఎస్.వి.కృష్ణారెడ్డి.

### ప్రారంభోత్సవంలోనే "ముద్దు"

ఎ. కోదండరామి రెడ్డి దర్శకత్వం వహించే "బొబ్బిలి సింహం" చిత్రానికి జనవరి 16న రాజమండ్రికి పదకొండు కిలోమీటర్ల దూరంలో ఉన్న హేమాద్రి గుట్టవద్ద ప్రారంభోత్సవం జరిగింది. పలుప్రాంతాల నుంచి వందల సంఖ్యలో బాలకృష్ణ అభిమానులు హాజరయ్యారు. బాలకృష్ణ తొలి డైలాగ్ చెప్పగానే వేదిక పై ఉన్న నాయిక మీనా ముద్దు పెట్టుకునే సరికి షూటింగ్ చూడవచ్చిన జనమంతా కేరింతలు కొట్టారు. రోజా మరో నాయిక. శారద, జగ్గయ్య, సత్యనారాయణ, శరత్‌బాబు, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, బాబూమోహన్, తనికెళ్ళ భరణి, రాళ్ళపల్లి, చలపతి రావు, జె.వి. సోమయాజులు, గోకిన రామారావు, సంగీత, మధురిమ ఇతర పాత్రధారులు. మాటలు: పరచూరి సోదరులు, సంగీతం: కీరవాణి, నిర్మాత: టి. తివిక్రమ రావు, బాలకృష్ణ పుట్టిన రోజు జూన్ 10 న విడుదల చేయదలచినట్లు సహనిర్మాత టి. ప్రద్యుమ్నరావు తెలిపారు. ఇది సినిమా స్కోప్ చిత్రం.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సర చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

# నెల్లూరు జిల్లా ఆయిల్ మిల్లర్స్ వెల్ఫేర్ అసోసియేషన్

పప్పులవీధి, నెల్లూరు.



## కృతజ్ఞతలు

ఎన్నో సంవత్సరాలుగా అవిశ్రాంతంగా పోరాడుతున్నా
పన్నులు తగ్గించని ప్రభుత్వం
ఇటీవల వేరుశెనగ పప్పు, నూనె, వేరుశెనగ పిండి పై పన్నులు
తగ్గించి రైతులకు, మిల్లర్లకు మరియు వినియోగదారులకు మేలు
చేకూరే విధంగా ఉపకారం చేసిన మన ముఖ్యమంత్రి

## గౌ. శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారికి

మా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఆయన ఉదార హృదయంతో
టర్నోవర్ టాక్స్ కూడా ఎత్తివేసి ప్రజలు, వ్యాపారస్తుల మన్ననలు
పొందాలని ఆకాంక్షిస్తున్నాము.

ఆనం వివేకానంద రెడ్డి
గౌరవ అధ్యక్షులు

ఎస్. పెంచల రెడ్డి
ప్రెసిడెంటు

జి. రమణారెడ్డి
వైస్ ప్రెసిడెంట్

బి. మాలకొండరాయుడు
సెక్రెటరి

జి. వెంకటేశ్వర రావు
జాయింట్ సెక్రటరి

### శుభాకాంక్షలతో

### వింజమూరు
మురళీకృష్ణా ఆయిల్ మాన్యుఫ్యాక్చరర్స్
విష్ణుప్రియ ఆయిల్ ప్రొడ్యూసర్స్
గోపీకృష్ణా ఆయిల్ మిల్
ప్రసన్నా ఆయిల్ ట్రేడర్స్
పద్మావతి ఆయిల్ మిల్

### ఆత్మకూరు
మురళీకృష్ణా ఆయిల్ మిల్
మహాలక్ష్మి ఆయిల్ మిల్

### కలిగిరి
శ్రీ లక్ష్మీనరసింహా ఆయిల్ మిల్

### ఎర్రబల్లి
శ్రీ వెంకటేశ్వర ఆయిల్ ట్రేడర్స్

### ఉదయగిరి
శ్రీ కాజా ఆయిల్ ప్రొడ్యూసర్స్
శ్రీ లక్ష్మీ వెంకటేశ్వర ఆయిల్ మిల్
శ్రీ రాఘవేంద్రా ఆయిల్ మిల్

### కావలి
శ్రీనివాస సుబ్రహ్మణ్యేశ్వర ఆయిల్ ట్రేడర్స్
శ్రీ ఈశ్వరి ఆయిల్ కాంట్రాక్టర్స్ కంపెనీ
శ్రీ అమరా కొండయ్య ఆయిల్ మిల్



ఆనం వివేకానంద రెడ్డి
గౌరవ అధ్యక్షులు

### వెంకటగిరి
శ్రీ వెంకటేశ్వర మారుతి ఆయిల్ మిల్
వరలక్ష్మి కృష్ణా వెంకటేశ్వర ఆయిల్ మిల్

### నాయుడుపేట
శ్రీ రాజ్యలక్ష్మి ఆయిల్ మిల్
శ్రీ సప్తగిరి ఆయిల్ ఇండస్ట్రీస్

శ్రీ పార్థసారధి ఆయిల్ మిల్

### నెల్లూరు
శ్రీ లక్ష్మి నరసింహా ట్రేడింగ్ కంపెనీ
భారత్ ఆయిల్ మాన్యుఫ్యాక్చరర్స్
తిరుమల ఆయిల్ ప్రొడ్యూసర్స్
శ్రీ వెంకటేశ్వర ఆయిల్ మిల్
శ్రీ వాణి దాల్ & ఆయిల్ మిల్
శ్రీ మహాలక్ష్మి ఆయిల్ మిల్

### కోవూరు
శ్రీ ధనలక్ష్మి ఆయిల్ మిల్
శ్రీ లక్ష్మి నారాయణ ఆయిల్ మిల్

### గూడూరు
శ్రీ సత్యనారాయణ ఆయిల్ మిల్
శ్రీ సంపూర్ణ ఆయిల్ మిల్
శ్రీ వెంకటేశ్వర ఆయిల్ మిల్
ఇడిబుల్ ఆయిల్ ఎక్స్‌ట్రాక్షన్స్

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.